# ప్రజల మనిషి ప్రకాశం





రావినూతల శ్రీరాములు

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహకారంతో ముద్రితము.

ప్రతులు : వెయ్యి



తొలి ముద్రణ : 1985

వెల : రూ. 20/-

ప్రతులకు :
ఆర్. శ్రీరాములు
10/228 వసంతపురి కాలనీ,
మల్కాజ్‌గిరి,
హైదరాబాదు - 500 047.
మరియు
విశాలాంధ్ర ప్రచురణాలయం
విజ్ఞాన్‌భవన్ 4-1-435 బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
విజయవాడ, హైదరాబాద్, అనంతపురం,
విశాఖపట్టణం, తిరుపతి, హన్మకొండ,
గుంటూరు, కాకినాడ.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1,
న్యూ బాకారం, గాంధీనగర్,
హైదరాబాద్ - 500380.
ఫోను : 7611413.

# మున్నుడి

ప్రకాశం అభివృద్ధి అధ్యయన సంస్థ తొలి ప్రచురణగా వెలువడిన శ్రీ రావి నూతల శ్రీరాములుగారి రచన "ప్రజల మనిషి ప్రకాశం" 1981 మే 20 వ తేదీన నాటి ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగారిచే ఆవిష్కరింపబడినది.

శ్రీ ఉప్పులూరి మల్లికార్జునశర్మగారి చొరవతో విజయవాడలోని శ్రీ మహా లక్ష్మి ఎంటర్ ప్రైజెస్ వారు ఈ రచనకు బహుళ ప్రచారం కల్పించారు.

ఈ పుష్కర కాలంలో మా సంస్థ అనేక కార్యక్రమాలు నిర్వహించింది. పంతులుగారి "నా జీవిత యాత్ర" ఆంగ్లంలో ప్రచురింపబడడం, ఢిల్లీలో ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారి చేతులమీదుగా ప్రకాశంగారి విగ్రహ ప్రతిష్ఠాపన వీటిలో ముఖ్యమైనవి.

ప్రకాశం గారికి ఆత్మీయులైన నడింపల్లి నరసింహారావుగారు తమ ఆత్మ కథలో "ఆంధ్ర కేసరి యొక్కడే రాష్ట్ర వ్యక్తిత్వమునకు తన సర్వస్వమును శిబిచక్రవర్తివలె ధారవోసెను. వారి దేశమున జన్మించని ఎడల అంధ దేశముగా పిలసిల్లెడిది" అని వ్రాసిన మాటలు చిరస్మరణీయములు.

మాజీప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ నవ్యాంధ్ర జనకుడనీ ప్రస్తుత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు హాలహాలం స్వీకరించిన మహా శివుడనీ, మాజీ రాష్ట్ర పతి వి. వి. గిరి హిమాలయోత్తుంగ వ్యక్తిత్వం కలవాడని ఆంధ్రకేసరికి నివాళు లర్పించారు.

తాను సవ్యంగా పయనిస్తున్నా తన వెంట ప్రజలు రారనీ అదే ప్రకాశం అపసవ్యంగా ప్రయాణిస్తున్నా ప్రజలు ఆయనను వెన్నంటివుంటారని [illegible] చెప్పుకునేవారు.

కాసీ పంతులుగారు సైమన్ నిరసన సందర్భంగా తుపాకికి గుండె చూపిన సంఘటన అతిశయోక్తి అని కొందరు భావించారు. పత్రికలకు అలాగే వ్రాశారు కూడా. వారికి సమాధానంగా ఆనాటి ఆంధ్రపత్రిక వార్త సాక్ష్యాధారంగా ఇందు పొందుపరిచారు.

రచయిత శ్రీ శ్రీరాములు నిరంతర పరిశోధకులు. వీరికి దేశారాధకుల పట్ల ఎనలేని గౌరవం. ఆంధ్రకేసరితో సహా పలువురు స్వాతంత్ర్య సమర యోధులను బాల్యంనుండి దర్శించిన ధన్యజీవి.

దేశభక్తుల జీవిత చరిత్రలను వ్రాయడంలో సిద్ధహస్తులైన వీరికి ఇటీవల తెలుగు విశ్వవిద్యాలయం ప్రతిభా పురస్కారం యిచ్చి సన్మానించడం ముదావహం. భావితరముల వారికి ఉపయుక్తమైన ఇట్టి రచనలను ప్రోత్స హించడం మిక్కిలి అవసరం. రచయితను మనసారా అభినందిస్తున్నాను.

టి. సూర్యనారాయణరావు
ఉపాధ్యక్షుడు
ప్రకాశం అభివృద్ధి అధ్యయన సంస్థ.

23-8-95
హైదరాబాదు.



T-Prakasam



ప్రకాశంగారి భార్య
**శ్రీమతి హనుమాయమ్మ**

# అంకితం

అమృత హృదయుడు
ఆబాల్య మిత్రుడు
ఆదర్శాలకు అంకితుడు
ఆడంబరాలకు దూరస్థుడు
అమ్మనబ్రోలు వెంకటకృష్ణ
చైతన్య (ఎ.వి.కె) గారికి

# ప్రస్తావన

ఆగస్టు 23 ఆంధ్రులకు పర్వదినం. నాలుగు దశాబ్దాలకాలం దక్షిణ భారతాన్ని ప్రభావితం చేసిన తెలుగుబిడ్డ టంగుటూరి ప్రకాశం 1872లో ఆనాడు జన్మించారు.

కొందరివలె బొడ్డున మాణిక్యంతో ప్రకాశం జన్మించలేదు. మరికొందరి వలె గొప్పతనం ఆయనకు కట్టబెట్టడం జరగలేదు. తన గొప్పతనానికి తానే కారకుడు కావడంలోనే ప్రకాశం విశిష్టత వున్నది.

అందుకే ఆయన మట్టిలోని మాణిక్యం అయి వెలిగాడు.

ప్రకాశంగారికి మించిన త్యాగధనులు, మేధావులు వుండవచ్చు, ఉన్నారు కూడా. అయినా ఏ దేశనాయకునికంటే మిన్నగా ప్రజాహృదయాలలో చోటు చేసికొన్న మహానాయకుడైనాడు ప్రకాశం.

అందుకే 'ప్రకాశమే ప్రజ. ప్రజ అంటే ప్రకాశం' అని గుండెమీద చేయి వేసి చెప్పజాలిన సాహసం టంగుటూరివారికే చెల్లింది.

తమ క్షేమంకంటే సమాజ క్షేమం కోరేవారే మహాపురుషులు. ఆ కోవలో ముందు శ్రేణిలో నిలువదగినవారు ఆంధ్రకేసరి.

85 ఏండ్ల నిండు జీవితం గడపిన మహానాయకుని చరిత్రలో ఓహో, సెభాస్, ఔరా అనిపించే సంఘటనలు ఎన్నో చోటు చేసికున్నాయి.

కష్టసుఖాలు కావడికుండలవలె భావించి జీవయాత్ర సాగించిన యాత్రికుడు ప్రకాశం.

తెలుగువారిలోనున్న సుగుణాలు సాహసం, త్యాగం, నిష్కాపట్యం, పట్టుదలలతోపాటు తిరుగుబాటుతత్త్వం ఆవేశం, దుడుకుతనంకూడా ఆయనలో చోటు చేసికున్నవి.

అందుకే అసలైన ఆంధ్రుడు ఆంధ్రకేసరి. తన జీవితాన్నేగాక తన ఐశ్వర్యాన్ని ప్రజలకే అర్పించిన ఆంధ్రకేసరి అమరగాథ అజరామరమైనది.

# ఆర్వేలవారు

ఆంధ్ర బ్రాహ్మణ శాఖలలో ఆరువేల నియోగిశాఖ ప్రసిద్ధమైనది.

కుతుబ్‌షాహి పాలనలో ఆరువేల గ్రామాలలో నియోగింపబడిన గ్రామాధికారులే ఆరువేల నియోగులుగా పిలువబడినారని కొందరి తలంపు.

ప్రెగడ, రాజు, పంతులు, కవి, అయ్య - వీటిని ఇంటిపేరుగానో పేరు చివరనో ఆయా కుటుంబాలు గ్రహించి చిరస్థాయిగా వుండేటట్లు చేసుకొన్నారు.

ప్రజ్ఞావిశేషణకు పాలనాసామర్థ్యానికి ప్రజాసంక్షేమానికి అభ్యుదయ భావాలకు నియోగులు పర్యాయపదాలుగా వుంటూ వచ్చారు. అమాత్యులయిన తిమ్మరుసు, భాస్కరమంత్రి, అక్కన్న మాదన్నలు, కవులయిన తిక్కన, ఎఱ్ఱన, పోతన, శ్రీనాథుడు ఈ శాఖవారే!

ప్రకాశంగారి వంశమువారు చిరకాలం కరణీకం చేసికుంటూ పంతులు పేరిట పిలవబడినారు.

కేవలం వారు జన్మించిన వంశం వివరించడానికి ఈ ప్రస్తావన కానీ ప్రకాశంగారికి ఏ కోశానా కుల దురాభిమానం వుండేది కాదు.

# మట్టిలో మాణిక్యం

ఈనాడు ప్రకాశం జిల్లా కేంద్రమైన ఒంగోలు పరిసర గ్రామాలలో ప్రకాశంగారి అనుబంధం ఆసక్తిదాయకము.

ప్రకాశంగారి పూర్వీకుల స్థావరం టంగుటూరు. అదే వారి ఇంటిపేరుగా రూఢి అయినది. కాని వీరి తండ్రుల కాలంలో టంగుటూరికి ఉత్తరంగా ఆరు మైళ్ళ దూరంలోవున్న వల్లూరు గ్రామంలో స్థిరపడడం జరిగింది.

వల్లూరు ట్రంకురోడ్డు అనుకొని వున్న చిన్న గ్రామం. పశ్చిమాన పెద్ద చెరువు. మొదటినుండి గ్రామంలో చదువుకున్న వారిసంఖ్య ఎక్కువే. పంతులు గారు టంగుటూరి వెంటప్పయ్యగారి వద్ద ఓనమాలు నేర్చినది ఇక్కడనే. ఆంధ్ర దేశంలోని అన్ని ప్రాంతాలు ఆయన తిరిగినా వల్లూరు అంటే ప్రత్యేక అభిమాన ముండేది.

ఆ గ్రామస్థుడు, ఆ దగ్గరిలో మరొక గ్రామ కరణం అయిన టంగుటూరి జగన్నాథం ప్రకాశం గారి సన్నిహితుడు. పంతులుగారితో ఉత్తర ప్రత్యుత్త రాలు సాగించేవాడు.* ఆయన అధ్వర్యంలో 1937 లో రెవిన్యూ మంత్రిగా ప్రకాశంగారు వల్లూరు వచ్చినప్పుడు ఘనంగా సన్మానం జరిగింది. ఆ సంద ర్భంలో టంగుటూరి ఆదిశేషయ్య పంతులు తమ పాఠశాల సందర్శించిన ప్రకాశంగారికి పంచరత్నాలతో స్వాగతం చెప్పారు. ఆనాడు జరిగిన బహిరంగ సభలో జిల్లెళ్ళమూడి శ్రీనివాసరావు "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అని ప్రారంభించిన స్వాగత పత్రం సమర్పించారు.

1946 లో మద్రాసు ప్రధానిగా వున్న దినాలలో ప్రకాశంగారు ప్రవేశ పెట్టిన ఫిర్కా డెవలప్‌మెంటు స్కీములో వల్లూరు కూడా చేర్చారు.

1955 లో ఒంగోలు నుండి శాసన సభకు పోటీచేస్తూ చివరిసారిగా వల్లూరు వచ్చి తన దాయాదుల ఇండ్లన్నీ చుట్టివచ్చారు ప్రకాశం.

---

* ఉదాహరణగా ప్రకాశంగారు స్వదస్తూరిలో మద్రాసునుండి 20-4-1921న వ్రాసిన ఈ ఉత్తరం చూడవచ్చును. "నా ప్రియమైన జగన్నాథం, మీరు పోయిన నెల తే 4 దిన వ్రాసిన ఉత్తరం చేరినది. ఇక్కడ నేను ప్రాక్టీస్ మానివేసి కాంగ్రెస్ పనిమీద వుండే రోజులలో భూములు కొనుట ఎలాగు వీలు అగును? మీరందరు కూడ కాంగ్రెస్ విషయమై పని చేయవలసి యున్నది. నేను ఈ నెలాఖరుకు ఒంగోలు వస్తూ యున్నాను. అప్పుడు వల్లూరు కూడ వస్తూ యున్నాను. మనము మాట్లాడవచ్చును."

అమ్మనబ్రోలు నుండి కనుపర్తికి పోయే మార్గంలో వున్న చిన్నపల్లె "వినోదరాయుడు పాలెం." కనుపర్తి ప్రధాన గ్రామం కాగా దాని శివారు వినోద రాయుని పాలెం. పంతులుగారి మేనమామల గ్రామం కావడంతో ఆయన జననం ఇక్కడే జరిగింది.

ప్రకాశం గారి మేనమామలు కనుపర్తివారు. కనువర్తి సముద్ర తీరం. ఒకప్పుడు విదేశీ వ్యాపారం సాగిన కాలంలో రేవు పట్టణం. ఆ ఊరిలో రోమ్ నాణేలు దొరికినవి. ఇప్పటికీ శివలింగాలు, నందీశ్వర విగ్రహాలు కొల్లలుగా వున్నవి.

గుండ్లకమ్మ నది ఒడ్డున "దేవరం పాడు'' మరొక పల్లెటూరు. వినోద రాయుడు పాలెం దేవరంపాడు గ్రామాలను గుండ్లకమ్మనది వేరు చేస్తున్నది.

దేవరంపాడులో గుండ్లకమ్మ ఒడ్డున ప్రకాశంగారికి కొంత పొలం వున్నది. బ్రిటిష్ దొరలకు పట్టణాలలో పల్లెలలో కూడా బంగళాలు వుండటం ఆచారం. ఆ మాదిరిగా ప్రకాశంగారు దేవరంపాడులో బంగళా కట్టించి తోట వేయించారు. టంగుటూరి లక్ష్మీనరసింహం అనే యువకునికి ఈ పని అప్ప గించారు. తరువాత కాలంలో ఆయన పెద్ద పదవిలో డాక్టరుగా స్థిరపడినాడు.

1930 ఉప్పు సత్యాగ్రహంలో పంతులుగారి బంగళా దేవరంపాడు శిబి రంగా సత్యాగ్రహులకు యాత్రాస్థలమైనది.

1935లో రాజేన్‌బాబు ఇక్కడ విజయస్తంభం ప్రతిష్ఠించారు.

1953లో రాష్ట్ర ముఖ్యమంత్రిగా ప్రకాశం కడసారి దేవరంపాడు శిబిరం దర్శించారు.

ఉల్చి చిత్రకారుడు రెడ్డిబోయిన వెంకటేశ్వర్లు తాను వేసిన ప్రకాశం తైలవర్ణ చిత్రాన్ని పంతులుగారికి బహూకరించారు.

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, ప్రకాశంగారి విశ్వాసపాత్రుడు అయిన సాగి విజయరామరాజు జన్మస్థానం దేవరంపాడే!

అద్దంకి కూడా గుండ్లకమ్మ నదీతీర గ్రామం అక్కడ ప్రకాశంగారి అక్క బావలు వుండేవారు రెండు సంవత్సరాలు పోరూరి నరసింహం (బావ) గారి వద్ద ప్రకాశం చదువు సాగింది. చదువుతోపాటు గుండ్లకమ్మలో ఈత, తాలింఖానాలో కసరత్తు అద్దంకిలోనే నేర్చుకున్నారు.

ప్రకాశం తల్లిమాట మేరకు అక్కకుమార్తె హనుమాయమ్మను 1890 లో అద్దంకిలో వివాహం చేసికొన్నారు.

ఒంగోలులో మిడిల్ స్కూలు విద్య నేర్చిన ప్రకాశం 'ఆకతాయి'గానే పేరు గడించాడు. ఒంగోలులో నల్లకోటు ధరించిన లాయర్లే ప్రకాశం న్యాయవాది కావడానికి కారణభూతులైనారు. స్వాతంత్ర్య సమరకాలంలో ఆయనకు పెక్కురు శిష్యులు ఒంగోలు వారుండేవారు. వీరిలో ధారా గోపాలశాస్త్రి, వాశిరాజు రాజేశ్వరరావు, గుండ్లాపల్లి ఆదినారాయణ,నీలంరాజు వెంకటశేషయ్య ప్రభృతులు ఎన్నదగినవారు. ఒంగోలు జాతీయ పాఠశాల, గురవారెడ్డి పాలెం ఖాదీ కేంద్రం మహాత్ముని మన్ననలందిన సంస్థలు.

# తల్లి సాహసగాథ

తన 12 వ ఏటనే తండ్రిని పోగొట్టుకున్న ప్రకాశానికి నాయుడు పేటలో తండ్రి ఉద్యోగం చేస్తూ వుండడం మూలాన ఇంగ్లీషు చదువు కొంత అక్కడ సాగింది. కానీ అల్లరి చేష్టలలో మార్చులేకపోవడంతో తండ్రి నానా బాధలు పడుతూ వుండేవాడు. భర్త మరణం తర్వాత తన పోషణ తానే స్వయంగా చూచుకోవడం మంచిదని భావించి గంపెడు సంసారంతో ఒంగోలు పట్టణం చేరుకున్న సుబ్బమ్మగారి సాహసం చెప్పకోదగినది. ఆ కాలంలో చిన్నచూపుగా చూపబడే 'పూటకూలి' తాను చేపట్టింది. కన్నబిడ్డలకు రెక్కలు రావడానికి ఆ తల్లి తన రెక్కలను ముక్కలు చేసికొని సంసారం ఈడ్చుకొని వచ్చింది.

తల్లి 'పూటకూలి' పెడుతున్నా ఇల్లు గడవకపోతే ప్రకాశం వారాల భోజనం కుదుర్చుకోవలసివచ్చింది.

ప్రకాశం మిడిల్ స్కూలు పరీక్ష ఫీజు మూడు రూపాయలు దొరకని రోజులవి. బావ దగ్గర దొరుకుతుందేమోనని 25 మైళ్ళ దూరంలో వున్న అద్దంకికి నడక సాగించినా ఫలితం దక్కలేదు. చివరకు తన పట్టుగుడ్డను తాకట్టుపెట్టి కుమారునికి ఫీజు కట్టించిన మహాతల్లి ఆమె.

ఓ విచిత్ర సంఘటన.

ఆ కాలంలోనే పూనా నాటకాల కంపెనీ ఒకటి ఒంగోలు వచ్చి హిందీలో ప్రమీలా స్వయంవరం, పీష్వా నారాయణరావు వధ, ఉషా పరిణయం, కీచక వధ మొదలైన నాటకాలు ప్రజారంజకంగా ఆడటం మొదలుపెట్టారు. కుర్రకారుతో బాటు ఈ నాటకాలు చూచిన ప్రకాశం ప్రభావితుడైనాడు. ఈ భావాగ్నికి ఆజ్యం తోడైనట్లు ఒంగోలులో నాటకాల పిచ్చి కల్గిన ఉండదల్లీ సాహెబుగారి అండ కొంత దొరికింది ప్రకాశానికి. ఆ ఊళ్ళో మిషన్ స్కూల్లో లెక్కలు మాష్టారు ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు కూడా నాటకాల కంకితమైనవాడే. ఆయన దృష్టిని ఆకర్షించాడు ప్రకాశం.

ఇక నేం, యువ ప్రకాశం నాటకాల ప్రపంచంలో పడిపోయి, ఆడ, మొగ వేషాలు అవలీలగా వేయడం మొదలుపెట్టాడు. వెనకా ముందూ చూడ్డం లేదుగా ప్రకాశానికి! ఆ నాటకాలతో చదువు గూడా వెనుకబడిపోయింది - "సంగీతముచేత బేర సారములుడిగెన్" అన్నట్లు.

ఈ లోగా తనకు అండ, ఆశ్రయం, ఆదరణ యిచ్చిన నాయుడుగారు రాజమండ్రి ఉద్యోగార్థం వెళ్ళడం తటస్థించింది. ఎలాగో తల్లిని ఒప్పించి ప్రకాశం గూడా నాయుడిగారితోబాటు రాజమండ్రి చేరాడు.

విద్యార్థి ప్రకాశం నాయుడుగారి పర్యవేక్షణలో నున్నాడనే ధైర్యంతో సుబ్బమ్మగారు రాజమండ్రి విద్యాభ్యాసాన్ని అంగీకరించింది. తన కష్టాలు గట్టెక్కి తన కుమారుడు ప్రయోజకుడైనాడని చరమ జీవితం తృప్తితో గడిపింది సుబ్బమ్మగారు.

1907వ సం॥లో మరణ సమయంలో అప్పటికే బారిష్టర్ గా పేరొందిన తన కుమారుడు ప్రకాశాన్ని పిలిచి, తాను ఎంత కాలంగానో దాచివుంచిన రూ. 800 లను ఆయన చేతవుంచి అంత్యక్రియలకు ఉపయోగించమని కోరినది ఆ మహా తల్లి.

తల్లి సాహసము పంతులుగారిని కండ్లనీళ్ళ పర్యంతము చేసింది.

# నాయకుడ్ని తీర్చిదిద్దిన నాయుడు

నూనూగు మీసాల నూత్న యవ్వనంలో ప్రకాశం తొలి ప్రేయసి నాటక రంగం. నాటకాలన్నా, నటులన్నా ఆ దినాల్లో చులకనభావం వుండేది. స్త్రీ పాత్రలు ధరించడానికి ఆడవారు ముందుకు వచ్చేవారు కారు. ఆడవేషాలు మగవారే వేయాల్సివచ్చేది.

సుందరమైన ప్రకాశం ముఖవర్చస్సు స్త్రీ పాత్రలకు మిక్కిలి అనువుగా వుండేది. నాటక కళ అంటే చెవికోసుకునేవారు ఆనాటి ఒంగోలు మిషన్ హైస్కూలు మేష్టారు ఇమ్మానేని హనుమంతరావు నాయుడు.

మొట్టమొదట ప్రకాశంను నటుడిగా గుర్తించిన మహనీయుడితడే! తరువాత తన కుటుంబ సభ్యులలో ఒకనిగా చేర్చుకున్నారు. ఆ వాత్సల్యానికి అవధులు లేవు.

మిషన్ హైస్కూలులో ప్రకాశంని ఫీజు లేకుండా చేర్పించడం నాయుడు గారి ఔదార్య పరంపరలో మొదటిది.

పంతులుగారు గురువుగారి పట్ల కృతజ్ఞతా సూచకంగా తమ కుమారునికి 'హనుమంతరావు' అని పేరు పెట్టుకొనినారు.

వృద్ధాప్యంలో కన్న కుమారునివలె పరిచర్యలు చేసి గురువుగారి ఋణం తీర్చుకున్నాడు ప్రకాశం.

హనుమంతరావు నాయుడు ఒంగోలు నుండి రాజమండ్రికి కుటుంబంతో సహా తరలి వెళ్ళారు. వేసవి శలవులలో అక్కడ గడిపి వస్తానని వారితో ప్రకాశం బయలుదేరాడు. గోదావరీ తీరవాసులు మేధావులని చిన్ననాడే విన్న ప్రకాశం రాజమండ్రి దర్శించాలనే ఆకాంక్ష ఈ విధంగా నెరవేరింది. రాజమండ్రి పరిసరాలలో వేసవి శలవులలో నాయుడుగారితో చూడవలసిన స్థలాలన్నీ ప్రకాశం చూచి ఆనందించాడు.

సెలవులు ముగిసిన తరువాత ఒంగోలు వెళ్ళడానికి రేవుకు వెడితే పడవలు అప్పటికే వెళ్ళిపోయినవని చెప్పారు. చేసేదిలేక ప్రకాశం నాయుడు గారితో విషయం వివరించాడు. ''మంచిపనే అయింది. ఇక నీవు నాతోనే వుండు ఇక్కడే చదువుకో" అన్నారు నాయుడు.

తప్పిపోయిన పడవతో ప్రకాశం జీవితం గొప్ప మలుపుకు తిరిగింది.

రాజమండ్రిలో చదువుతోపాటు నాటకాలు కూడా సాగించాడు ప్రకాశం. ఒక సంవత్సరం నాటకాలు కారణంగా చదువు కుంటుపడింది కూడా. అయినా పట్టుదలతో చదువు సాధించి 1891 లో యఫ్ ఏ. పరీక్ష అయినారు. మొదటి నుండి 'లా' (న్యాయవాది) పట్టా పైనే ప్రకాశం దృష్టి.

మద్రాసు 'లా' కాలేజీలో చదివి సెకండ్ గ్రేడ్ ప్లీడరుగా నమోదయి నాడు ప్రకాశం. వి.వి. గిరి తండ్రి జోగయ్య పంతులు మద్రాసు 'లా' కాలేజీలో ప్రకాశం సహాధ్యాయి. 'లా' చదువు పూర్తిచేసిన తర్వాత ఒంగోలులోనే వుండి పొమ్మన్నారు బంధువులు కానీ తన ఉన్నతికి కారకుడైన నాయుడిగారిని వదలి వుండలేక ప్రకాశం రాజమండ్రిలోనే ప్రాక్టీసు పెట్టారు. అలా 1894 లో మొద లయిన ప్రాక్టీసు అనతికాలంలోనే బాగా పుంజుకొన్నది.

# రంగస్థల నక్షత్రం

నాటకాలలో స్త్రీ పాత్రలువేసినా ప్రకాశం నిజజీవితంలో ఎల్లకాలం వీరుడు (హీరో)గానే ప్రకాశించాడు.

ప్రకాశం నటుడిగా రాణకెక్కింది రాజమండ్రిలోనే. ఇమ్మానేని హనుమంతరావునాయుడు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగార్లు 1889 లో ఒక నాటక సమాజాన్ని అక్కడ స్థాపించారు.

చిలకమర్తివారి నాటకాలలో గయోపాఖ్యానం, పారిజాతాపహరణం కీచకవధ, ద్రౌపదీ పరిణయం ప్రసిద్ధమయినవి. గయోపాఖ్యానంలో చిత్రలేఖ, పారిజాతాపహరణంలో సత్యభామ పాత్రలను ఔచిత్యంతో నటించి ప్రేక్షకులను మెప్పించేవారు ప్రకాశం.

చిలకమర్తివారికి ప్రకాశంగారు మిక్కిలి ప్రేమాస్పదులు. ప్రకాశంగారు నటించే పాత్రను ఆయన వ్యక్తిత్వానికి, హావభావాల ప్రదర్శనకు అనువుగా రూపొందించేవారట.

వీరేశలింగంగారి సారంగధరలో రత్నాంగినలదమయంతిలో దమయంతి పాత్రలు ప్రకాశంగారు చక్కగా పోషించెడివారు.

ప్రకాశంగారి నటనను కాంగ్రెసు అధ్యక్షులు పనప్పాకం ఆనందాచార్యులు మెచ్చుకొన్నారు. ఒరిస్సా కళాకారులు శ్యామసుందర రాజగురు ప్రకాశం నటనకు మెచ్చి "రంగస్థల నక్షత్రం" అని బిరుదు నిచ్చారు.

ప్రకాశం ధవళేశ్వరంలో తిరునాళ్ళకు వెళ్ళగా నాటి ప్రకాశం వ్యక్తిత్వాన్ని చిలకమర్తి వారు ఈ సీస పద్యంలో వర్ణించారు:

"ఈగ వ్రాలిన గాని వేగ పారెడునట్లు
ముచ్చంపు కురులను దువ్వినాడు
వర లలాటమునందు తిరు చూర్ణ రేఖను
ముద్దుగారెడుభంగి దిద్దినాడు
అరుణ పల్లవమట్లు కరము రంజిల్లు
చెంగావి వస్త్రంబు గట్టినాడు
చారలంగరఖాను ధరియించి
వలెవాటు కండువా వైచినాడు
చెవులసందున గిరజాలు చిందులాడ
మొగముమీదను చిరునవ్వు మొలకలెత్త
టంగుటూరి ప్రకాశము రంగు మెరయ
ధవళగిరి తీర్థమునకు దా దరలి వచ్చె."

1891 లో అమలాపురంలో గయోపాఖ్యానం నాటకాన్ని ప్రదర్శించారు. ప్రకాశం చిత్రలేఖ పాత్ర తరువాత ఘట్టంలో అర్జునుని పాత్ర ధరించి ప్రేక్షకుల ప్రశంసల నందుకున్నాడు.

మరునాడు ముగ్గురు తెల్లదొరలు నాయుడుగారిని సమీపించి, రాత్రి నాటకంలో పాల్గొన్న నటులను వారి వారి వేషాలతో ఫోటోకు అనుమతించమని కోరారు.

నాయుడుగారు 'సరే'అన్నారు కానీ ప్రకాశం ఎంత బ్రతిమాలినా ఒప్పుకో లేదు.

మనమేం పగటి వేషగాళ్ళమా? అని ఎదురుతిరిగాడు.

మొండికేసిన కుర్రవాణ్ణి (ప్రకాశం) ఎవరు వొప్పించలేకపోయారు.

# మునిసిపల్ రాజకీయం

ఆంధ్రదేశంలో మొట్టమొదటి మునిసిపాలిటీ రాజమండ్రిది. న్యాయవాదులు విరివిగా రాజకీయాలలో పాల్గొనే రోజులవి.

ప్రకాశం రెండు మూడుసార్లు మునిసిపల్ కౌన్సిలర్‌గా పోటీ చేయడం ఓడిపోవడం జరిగింది.

1889 లో మాత్రం విజయలక్ష్మి ప్రకాశాన్ని వరించింది. అప్పటికి ఆయన వయస్సు 27 మాత్రమే! అప్పటిలో ప్రభుత్వ ఉద్యోగులు కూడా మునిసిపల్ అధ్యక్షులుగా ఎన్నికవుతూ వుండేవారు.

వర్గాలు తీవ్రంగా వుండి ప్రకాశం నాయకుడైన వర్గం బలం పుంజుకోవడంతో ఆయన మునిసిపల్ చైర్మన్‌గా ఎన్నికైనారు. ప్రత్యర్థి వర్గానికి ఇది దుర్భరమైనది. ఎన్నో చాడీలు అభాండాలు ప్రకాశంగారిని గూర్చి చెన్నపట్నానికి చేరవేశారు.

ప్రకాశం చైర్మన్ అయినట్లు గెజిట్‌లో పడకుండా పడరాని పాట్లు పడ్డారు. గెజిట్‌లో వేయనిదే పదవి స్వీకారం సాధ్యంకాదు.

ప్రకాశం ఏమన్నా తక్కువతిన్నాడా? నేరుగా మద్రాసు వెళ్ళి పెద్ద దొరను కలిసి విషయం వివరించాడు.

"ప్రకాశం! నీకు ఆ ఊళ్లో ఇల్లే లేదట కదా?" అని దొర ప్రశ్నించాడు. ఛర్రుమన్నాడు ప్రకాశం. "రాజమండ్రి ఉద్యోగానికని వచ్చిన ప్రొఫెసర్లు కలెక్టర్లు మునిసిపల్ చైర్మన్‌గా పనికి వచ్చినపుడు నేను తగనా?" అని ఎదురు ప్రశ్న వేసే సరికి దొర నోరు మూతపడింది. "ప్రకాశం ప్రమాదకరమైన మనిషే. అయినా ఆయనను తప్పించుకోలేం. ఆయన పేరు గజెట్ చేయండి" అని వ్రాయక తప్పిందికాదు దొరగార్కి. ఆవిధంగా 1903 లో రాజమండ్రి మునిసిపాలిటీ చేజిక్కించుకున్నాడు ప్రకాశం.

ప్రజల కష్టసుఖాలు స్వయంగా విచారించేవాడు. ఇందుకోసం చైర్మన్ ప్రకాశం ప్రతిరోజూ ఉదయం గుర్రంమీద వీధులన్నీ తిరిగేవాడు.

ఎన్నో మార్పులు చూపి ప్రజలలో మంచి పాలకుడుగా గణన కెక్కాడు ప్రకాశం.

# విదేశీయానం

రాజమండ్రిలో ప్రాక్టీసు చేసే దినాలలో ప్రకాశం తరచూ వృత్తిరీత్యా చెన్నపట్నం వెళ్ళాల్సి వచ్చేది. ఒకదఫా అక్కడ జరిగిన సంఘటనలతో తానూ 'బారిష్టరు' కావాలనే నిర్ణయానికి వచ్చాడు.

**మరో అనుకోని సంఘటన :**

మునిసిపల్ రాజకీయాల్లో తల మునకలై వున్న కాలమది. ప్రతికక్షులు ఏదో ఒక సాకుతో ప్లీడరు ప్రకాశాన్ని, ఆయన స్నేహితులు, అనుయాయులను ఇరకాటంలో పెడ్తుండేవాళ్ళు. ఒకసారి ప్రకాశంగారి స్నేహితుడైన ఏలూరి నరసింహం అనే పెద్దమనిపై అబద్ధపు సాక్ష్యం కేసొకటి కోర్టు కెక్కింది. ఆయన తరపున వకీలు ప్రకాశంగారే.

కేసు సబ్ కలెక్టర్ వద్దకు విచారణకు వచ్చింది. ప్రకాశంగారు వకాల్తా పుచ్చుకొని సదరు కేసు మరో జిల్లాకి బదిలీ చేయించాలని, ముద్దాయి స్థానిక ప్రముఖులైనందువల్ల ఆ కేసు అక్కడ జరుగకూడదని పిటిషన్ పెట్టారు. ఆ పిటిషన్ కొట్టివేశారు. దానిమీద కేసు ట్రాన్స్‌ఫర్ కొరకు మద్రాసు హైకోర్టు కెళ్ళాడు ప్రకాశం. అక్కడ స్వామినాథన్ అను బారిష్టర్‌ను ఏర్పాటు చేసుకున్నాడు. కేసు హైకోర్టు బెంచి ముందుకు వచ్చింది.

న్యాయమూర్తి కేసు చూస్తూనే భీకరంగా కటువుగా స్వామినాథన్ కేసి "No points to argue, case dismissed" అనేశాడు!

అంత పెద్ద బారిష్టర్ నోరు విప్పిన పాపానపోలేదు. దానికి చిరాకెత్తి ప్రకాశం ఆయనన్నుద్దేశించి "ఇదేమి బారిష్టిరి అండీ, కేసు ఆర్గ్యుమెంటు చెప్ప కుండానే డిస్మిస్ చేస్తే, మీరు మాట్లాడక ఊరుకున్నారు?'' అని కేకలేసినంత పని చేశాడు. అందుమీద ఆయన అనుకోని విధంగా సౌమ్యధోరణిలో ప్రకాశం గార్ని తమ యింటికి డిన్నరుకు ఆహ్వానించాడు. ఇంటికి వచ్చిన ప్రకాశానికి సాదరంగా ఆతిథ్యం ఇచ్చి ''ప్రకాశంగారూ! మీలో మంచి చురుకుతనమూ, ధైర్యమూ కనిపిస్తున్నాయి. మీరు ఎందుకు బారిష్టర్ కాకూడదు?'' అని అన్నారు. ప్రకాశంగారి ప్రశ్నలకు, అనుమానాలకు సమాధానాలిచ్చాడు కూడా. దానికి స్పందించి ప్రకాశం ''అలా అయితే, ఒక అయిదారు వేలతో పూర్తి అయ్యేట్లుంటే తప్పకుండా బారిష్టరీ చేస్తాను'' అన్నాడు. ఆవిధంగా బారిష్టర్ ఐడియా ప్రకాశం మనసులో మెరిసి బీజరూపం దాల్చింది.

ఇకనే తిరిగి రాజమండ్రి వచ్చి స్నేహితులతో సంప్రదించినమీదట, తనకు కావలసిన ఆరువేల రూపాయలు, కంచుమర్తి రామచంద్రరావు, మాగంటి లక్ష్మణదాసులు చెరిసగం సర్దుతామనడంతో ఇంగ్లాండు వెళ్ళేందుకు రంగం సిద్ధమైంది.

ఆ విధంగా మిత్రుల అండదండలతో 1904 చివరన ప్రకాశం బారిస్టరు కావడానికి ఇంగ్లండు వెళ్ళాడు. అక్కడ లండన్‌లో ఎడిన్‌బరో యూనివర్సిటీలో బార్-ఎట్-లాకు నమోదై గ్రే అనే ''ఇన్'' (హాస్టల్ లాంటిది)లో చేరి చదువు సాగించాడు. 1904-1906 సం॥లో కల్లా ఆయన ప్రథమశ్రేణి బారిస్టరై స్వదేశా నికి తిరిగి వచ్చాడు. ఇంగ్లాండులో కూడా ప్రకాశం చరిత్ర సృష్టించాడు. అక్కడి విందులో ఒక్కొక్క విద్యార్థి ఉపన్యాసం యిచ్చి సిగరెట్ వెలిగించాలి. అది అనాదిగా వస్తున్న సంప్రదాయం.

ప్రకాశం తనవంతు వచ్చేసరికి దానిని త్రోసిరాజన్నాడు.

కేవలం కాలేజీ ఉపన్యాసాలు విని ప్రకాశం సరిపెట్టుకోలేదు. కోర్టులలో పనిజరిగే తీరు స్వయంగా పరిశీలించేవాడు. ప్రకాశం అనుభవం గడించినవాడు కావడంమూలాన బారిష్టరీ బహుమానాలుకూడా ఆయన గడించాడు.

# బారిష్టరుగా ప్రకాశం



బారిష్టరు ప్రకాశం

1907 ప్రారంభంలో బారిష్టరుగా మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించాడు. అప్పటివరకూ తమిళ లాయర్లయిన భాష్యం అయ్యంగారు, కృష్ణస్వామి అయ్యరు, సుందరం అయ్యరులాంటివారే ఆంధ్రప్రాంతంనుండి వచ్చే కేసులు చేపట్టేవారు.

అయ్యర్లూ, అయ్యంగార్లు మైలాపూరు మేధావులుగా ప్రసిద్ధులు. ప్రకాశం మద్రాసు చేరే నాటికి పేరి నారాయణమూర్తి అనే కాకినాడ న్యాయవాది మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు పెట్టాడు. ఆయన చాల చురుకైనవాడు. ప్రకాశం, నారాయణమూర్తిగార్లు అనతికాలంలోనే ముప్పాతిక భాగం ఆంధ్రుల కేసులు తమ వశం చేసుకున్నారు.

పట్టుదల, ఆత్మవిశ్వాసం ప్రకాశం గారిని న్యాయవాదిగా శిఖరాలకు తీసికొని వెళ్లాయి.

బారిష్టర్ల సంఘానికి అధ్యక్షులుగా ప్రకాశం ఎన్నికైనాడు. మద్రాసులా టైమ్సు పత్రిక 1912 నుండి 1921 వరకూ నిర్వహించాడు.

ఆయన ఫీజు రోజుకు వెయ్యి రూపాయిలుగా వుండేది. తరువాతి కాలంలో హైకోర్టు జడ్జి అయిన పాకాల వెంకటరమణరావు (జస్టిస్ రాజమన్నారు గారి తండ్రి), బులుసు సాంబమూర్తి, డా॥ కె కె పండాలే (సైమన్ కమిషను వచ్చినపుడు మద్రాసులో మెజిస్ట్రేట్) ప్రకాశంగారి వద్ద జూనియర్లుగా పని చేసేవారు. బారిష్టర్లు నడింపల్లి నరసింహారావు, వి.వి గిరిగార్లను కూడా ప్రకాశం గారే మద్రాసు హైకోర్టులో నమోదు చేయించాడు.

1907 నుండి వధ్నాలుగేండ్ల పాటు బారిష్టరు ప్రాక్టీసులో ప్రకాశం లక్షలు గడించాడు.

జడ్జిలకు ఏమాత్రం భయపడకుండా తనకు అన్యాయమని తోచినపుడు ఎదిరించేవాడు ప్రకాశం.

ఒక పర్యాయం బెంచి మీద జడ్జి నిద్రపోతూవుంటే ప్రకాశం తన వాదనలు నిలివేశాడు. జడ్జికి మెలకువ వచ్చిన తరువాత ''ప్రకాశం! ఎక్కడున్నావు?'' అని ప్రశ్నిస్తే, ''ఏమోనండి, వెనుకటి చోటనే....'' అని జవాబిచ్చాడు ప్రకాశం. మరలా జడ్జి అలాంటి పని చేసి ఎరుగడు.

మరొకసారి మరొక జడ్జి ప్రకాశం వాదన వినకుండా''ఇందులో ఏముంది?" అని విసుగుకుంటే, అయ్యా, నేను పార్టీల వద్ద చాలా ఫీజు తీసుకొన్నాను. వారికి న్యాయం చేకూర్చటం నా ధర్మం'' అని బదులు చెప్పేసరికి జడ్జి మెత్తబడినాడు.

మరొకసారి ఒక జడ్జి కేసు పది నిమిషాలలో ముగించు అన్నాడు. "అది సాధ్యం అయ్యే పనికాదు" అన్నాడు కాకమ్మ కబుర్లు చెప్పకు అని జడ్జి జులుం ప్రదర్శించాడు. కాగితాలకట్ట బల్లమీద పడేసి, క్షమాపణ చెబితేగానీ మీ కోర్టుకు నేను రాదలచలేదన్నాడు ప్రకాశం. అంతటితో ఆగక జడ్జి ప్రవర్తనను నిరసిస్తూ బారిష్టరు సంఘంచే తీర్మానం చేయించి ఆయనకు పంపించాడు. జడ్జి మెత్తబడి సంజాయిషీ చెప్పిన తర్వాతనే ప్రకాశం అతని కోర్టులో ప్రవేశించాడు.

మరొకసారి "లా టైమ్సు" పత్రికలో పడిన వ్యాసం 'కోర్టు ధిక్కారము' అవుతుందని హైకోర్టు ప్రకాశంకు నోటీసు యిచ్చింది.

ప్రకాశం నోటీసును చదివి దాని వెనుక "నేను ఈ నోటీసును తీసికోదలచు కోలేదు" అని త్రిప్పివేశాడు.

పెద్దలంతా పంతులు గారు కోరి శిక్షను పెంచుకొంటున్నాడని భయ పడ్డారు. అడ్వకేట్ జనరల్ ప్రకాశం వాదన సరిఅయినదని వాదించారు. హైకోర్టు నోటీసు ఉపసంహరించుకున్నది.

ప్రకాశం గారితో సమాన స్థాయి గల న్యాయవాదులు మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్‌లు మాత్రమే!

చిత్రంగా వీరు ముగ్గురూ ఢిల్లీ కేంద్ర శాసన సభలో సభ్యులైనారు 1926 సం॥లో!

# ప్రకాశం వీరేశలింగం

సాహిత్యంలోను సంఘంలోనూ అనేక మార్పులు రావడానికి కారకుడైన వీరేశలింగం పంతులు యుగపురుషుడు.

ప్రకాశంగారికి ఆయనపట్ల అమిత గౌరవం. ఆయన రచించిన నాటకాలు కూడా ప్రకాశం బృందం ప్రదర్శించింది. ఆయన చేసే వితంతు వివాహాలలో కూడా ప్రకాశం ఆసక్తి కనపరచేవారు.

ప్రకాశం రాజమండ్రి వచ్చినప్పుడు సూదిలా వుండి తరువాత దబ్బనంగా తయారైనాడని చాలమందికి గుర్తుగా వుండేది. సమయంకోసం వీరంతా ఎదురు చూసేవారు.

ప్రకాశం బారిష్టరు కోర్సు మధ్యలో రాజమండ్రి వచ్చినప్పుడు కొందరు ఆధారంపేర కుట్ర పన్నారు.

శంకరస్వామి పేరిట ప్రకాశం ఒక నోటీసు అందుకున్నాడు. విదేశీ యానం చేసిన హిందువులు ప్రాయశ్చిత్తం చేసికోవాల్సివుంది. అందుకు సిద్ధంగా వుండమని, లేనిచో వెలివేస్తామని అందులో హెచ్చరించారు.

ప్రాయశ్చిత్తానికి ప్రకాశం ససేమిరా ఒప్పుకోలేదు. వీరేశలింగం ఆయనకు అండగా నిలిచారు.

''మేము, మా పెద్దలుగానీ మీ అధికారాన్ని ఎన్నడూ అంగీకరించలేదు. కాబట్టి మీ ఆజ్ఞ పాటించవలసిన అవసరం మాకు లేదం"టూ ప్రకాశం జవాబిచ్చేసరికి స్వామీజీ అక్కడనుండి పలాయనం చిత్తగించారు.

ప్రకాశంగారి తమ్ముడు శ్రీరాములు. ఆయన కూడా లాయరుగా రాజమండ్రిలో ప్రాక్టీసు చేసెడివాడు. రాజమండ్రి నుండి ఆంగ్లపత్రిక నడిపేవాడు. ''అధోగతిలో సంస్కర్త'' అనే వ్యాసంలో వీరేశలింగంను తీవ్రంగా విమర్శించాడు. దానిపై వీరేశలింగం కోర్టుకు వెళ్ళారు.

శ్రీరాములుగారికి శిక్ష తప్పదు అనుకుంటున్న సమయంలో ప్రకాశం రాజమండ్రి చేరుకున్నాడు.

తమ్ముడ్ని కాపాడేందుకు శక్తివంచనలేకుండా వాదించి కేసు నెగ్గాడు. వీరేశలింగంను బోనులో నానా ప్రశ్నలతో బాధపెట్టాల్సివచ్చింది.

చివరకు ప్రకాశం వీరేశలింగం పంతులుగారిని క్షమాపణ కోరుకున్నాడు. ఇంత జరిగినా ఒకరిపట్ల మరొకరికి గౌరవం ఏమీ తగ్గలేదు.

# బీచ్‌లో బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలు

1907 మొదట్లో ప్రకాశం గారు మద్రాసులో ప్రాక్టీసు పెట్టి మంచిపేరు ప్రఖ్యాతులార్జించ మొదలెట్టారు. అవి బెంగాలు విభజన, వందేమాతరం, స్వదేశీ ఉద్యమం రోజులు. బెంగాల్‌లోని అతివాద దేశభక్తులలో అగ్రగణ్యుడైన బిపిన్

చంద్రపాల్ (Bipin Chandra Pal) గార్ని ముట్నూరి కృష్ణారావుగారు మద్రాసు రాష్ట్రానికి పిలిపించి ఉపన్యాసాలేర్పాటు చేశారు. 1907 ఏప్రిల్ నెలాఖరులో పాల్‌గారు రాజమండ్రి, విజయనగరం, వైజాగ్‌లలో ఉపన్యాస పరంపరను పూర్తి చేసుకుని, మేనెల మొదట్లో మద్రాసు చేరుకున్నారు. మద్రాసు బీచ్‌లో ఆయన ఉపన్యాసాలేర్పాటు చేయబడ్డాయి ఆయన "నూతన భారత దేశం" "నూతనోద్యమం" మొదలైన విషయాలపై ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలు చేశాడు. అసలే ఆయన మహోపన్యాసకుడు, అపైన అతివాద బ్రిటిష్ వ్యతిరేకోద్యమానికి సంబంధించిన విషయాలపై సమావేశాలు. అందువలన ప్రజలు ఆయన్ను చూచేందుకు, వినేందుకు తండోపతండాలుగా మద్రాసు బీచ్‌కి చేరేవారు

కాని బ్రిటిష్ ప్రభుత్వం ఆయన మీద నిఘా వుంచింది. రాజద్రోహ పూరితమైన ఉపన్యాసం చేస్తే వెంటనే ఆయన్ను అదుపులోకి తీసుకోడానికి సిద్ధంగా వున్నది. అందువలన ఆ సమావేశాలకు అధ్యక్షత వహించడానికి పెద్దలు కొంత జంకేవారు గూడా.

మొదటి ఉపన్యాసం 1907 మే 1 వ తేదీన జి. సుబ్రమణ్య అయ్యర్‌గారి అధ్యక్షతన జరిగింది. రెండవ తేదీన బారిష్టర్ ప్రకాశం అధ్యక్షత వహించాడు. ఆ రోజున అది కొంత సాహస కార్యమే. పైగా, సర్ శంకరర్ నాయర్ లాంటి పెద్దలు అటు పాల్‌గారికి, ఇటు ప్రకాశం గార్కి హెచ్చరికలు చేశారు, మీరు హద్దులు దాటేరు సుమా అని.

ఇంతలోనే మరొక సంఘటన జరిగింది. సిపాయి తిరుగుబాటు (1857) యొక్క స్వర్ణోత్సవ సందర్భంగా దేశంలో జరుగగల ఉద్రిక్తతను కారణంగా పెట్టుకుని, ఆనాటి పంజాబ్ ప్రభుత్వం మే నెల 9 వ తేదీన ప్రముఖ స్వతంత్ర సేనాని, కాంగ్రెస్ నేత లాలా లజ్‌పత్ రాయి గార్ని లాహోరులో అరెస్టుచేసి మాండలే జైలుకు (అండమాన్స్) పంపించేసింది. ఈ వార్త దావానలంగా దేశమంతా ప్రాకింది. ప్రభుత్వం రాజద్రోహం నేరంక్రింద ఏ దేశభక్తుడైనా అరెస్టు చేయవచ్చు, ఏ శిక్షనైనా వేయవచ్చు. ఆపరిస్థితులలో బిపిన్‌బాబు ఆ సాయంత్రం (మే 9) జరుగనున్న ఉపన్యాసాన్ని రద్దుచేసుకుని మద్రాసు వెళ్ళిపోయినాడు। ఎలాటి పరిస్థితికైనా సిద్ధపడిన ప్రకాశం గార్కి ఆశాభంగమే షిగిలింది అనాథు

# సూరత్ కాంగ్రెస్‌కు హాజరైన ప్రకాశం

ఇది జరిగిన కొన్ని నెలలకే, 1907 డిసెంబర్ ఆఖరులో కాంగ్రెస్ సభలు సూరత్ పట్టణంలో జరిగినాయి. మద్రాసు రాష్ట్రం నుండి ప్రకాశంగారు, వి. కృష్ణస్వామి అయ్యరు, జి.ఏ నటేశన్, యస్. దొరస్వామి అయ్యరు, వి. చక్రయ్యచెట్టి, న్యాపతి సుబ్బారావు పంతులు మరి కొందరు హాజరైనారు. అంతకు క్రితం కొద్ది వారాలముందే విడుదలైన లాలా లజ్‌పత్ రాయి సభలకు వచ్చి బ్రహ్మాండమైన సన్మానం పొందాడు.

అయితే సూరత్ కాంగ్రెస్ యొక్క ప్రత్యేకత ఏమంటే. కాంగ్రెసు అతివాదులు, మితవాదులు అని రెండు భాగాలుగా చీలిపోయి, సభాప్రాంగణం లోనే, సభావేదికపైన రెండు గ్రూపులూ విచ్చలవిడిగా తిట్టుకోడం, కొట్టుకోడం, చెప్పులు విసురుకునేవరకు దిగజారినాయి.

సూరత్ కాంగ్రెస్‌లో మితవాదులకు సర్ ఫిరోజిషా మెహతా, గోఖలే, సురేంద్రనాథ్ బెనర్జీలు నాయకత్వం వహించగా, అతివాదులకు లాలా లజ్‌పత్ రాయి, బాలగంగాధరతిలక్ బిపిన్ చంద్రపాల్ (లాల్-బాల్-పాల్‌త్రయం) నాయకులుగా వ్యవహరించారు సరే ఆ రభసలో మితవాదులే గెలిచారు.

అయితే, మొట్టమొదట సారిగా కాంగ్రెస్ సభల కెళ్ళిన ప్రకాశంగారు కృష్ణస్వామి అయ్యరుతో సహా సాక్షాత్తు సభావేదిక ముందే జరిగిన బీభత్సాన్ని గమనిస్తూ కూర్చున్నారు. రాజకీయాలలో ఆదర్శాలకు ఆచరణకు గల అంతరాలను చవి చూచాడు ప్రకాశం మొదటిసారిగా.

# దేశభక్తి బీజాలు

ఇంగ్లండులో "ఇండియన్ సొసైటీ" సంస్థలో దేశ భక్తులనేకులుండేవారు. ప్రకాశంగారు ఆ సంస్థలో సభ్యులుగా చేరారు. దాదాభాయి నౌరోజీ బ్రిటిష్ పార్లమెంటుకు పోటీ చేస్తే ప్రకాశం ఆయన తరఫున ప్రచారం చేశారు. ఆయన ఎన్నికల ఏజెంటుగా కూడా వ్యవహరించారు.

దక్షిణాఫ్రికాలో సమరం సాగిస్తూ వున్న గాంధీజీ బ్రిటన్ విచ్చేసినపుడు ప్రకాశం ఆయనను కలిసికున్నారు. అయితే అపుడు పూర్తి విదేశీ దుస్తులు ధరించి వున్నారు. 1917 లో కలకత్తా కాంగ్రెసులో ప్రకాశం ఆయనను తిరిగి దర్శించే సరికి గుజరాతీ తలగుడ్డ సహా పూర్తి భారతీయ దుస్తులు ధరించి వున్నారు. 1907 లో జరిగిన సూరత్ నుండి ప్రకాశం అన్ని కాంగ్రెసు సభలకు హాజరవుతున్నా కలకత్తా కాంగ్రెసు సభల నుండీ ప్రకాశం కాంగ్రెసు పట్ల శ్రద్ధ వహించసాగాడు.

1921 నాగపూర్ కాంగ్రెసు సహాయ నిరాకరణోద్యమంలో భాగంగా న్యాయస్థానాలు విద్యాసంస్థలు శాసనసభలను బహిష్కరించాలని తీర్మానించ బడింది.

కలకత్తాలో ప్రఖ్యాత న్యాయవాది చిత్తరంజన్‌దాసు, అలహాబాదులో ప్రముఖ న్యాయవాది మోతీలాల్ నెహ్రూ అప్పటికే తమతమ వృత్తులను మాని వేశారు.

మద్రాసు సముద్రపుటొడ్డున ట్రిప్లికేన్ బీచ్‌లో జరిగిన బ్రహ్మాండమైన సభలో 1921 సం॥ జనవరి 21 వ తేదీన ప్రకాశం తాను తన న్యాయవాద వృత్తిని విరమిస్తున్నానని చారిత్రాత్మకమైన నిర్ణయం ప్రకటించారు. మద్రాసులో అలా చేసినవారిలో ప్రకాశంగారే మొదటివారు.

''సహాయ నిరాకరణము - టంగుటూరి ప్రకాశముగారు న్యాయవాద వృత్తిని వదలుకొనుట'' అను శీర్షికన ఆంధ్రపత్రిక జనవరి 24, 1921 తేదిన ఈ విషయాన్ని రిపోర్టు చేసింది. సభకధ్యక్షత వహించిన ప్రకాశంగారు ''కాంగ్రెస్ తీర్మానమును శిరసావహించి నేను న్యాయవాద వృత్తిని నేటినుండి విసర్జించ కృతనిశ్చయుడనైతిని. దానివలన నేను గడించిన ధనమును ప్రజా హితమగు కార్యములకై వినియోగించెదను'' అని ప్రకటించినారు.

అంతకన్నా చెప్పుకోదగ్గ మరో విషయమేమంటే ఆ సభలో సి రాజ గోపాలాచారిగారు ఉపన్యసిస్తూ ''ప్రకాశం పంతులు గారంతటి నాయకులు మీకుండ మీరు భయపడనవసరము లేదు'' అని చెప్పి, విద్యార్థులను విద్యాల యాలను బహిష్కరించమని వుద్బోధించాడు.

అర్జన లక్షలమీద వున్నప్పుడు వృత్తిని విరమించిన ప్రకాశం త్యాగమే త్యాగమని పలువురు కొనియాడారు.

ఒకసారి నిర్ణయం తీసుకున్న తరువాత వెనుకంజ వేయటం ప్రకాశం తత్త్వానికి విరుద్ధం.

విలాస జీవితంలో పూలబాటకు స్వస్తి. దేశభక్తునికి కంటకమార్గమే ప్రీతి కల్గించింది ఆయనకు.

# స్వరాజ్య పత్రిక

పదునాల్గు సంవత్సరాలు మద్రాసు నగరంలో బారిష్టరుగా వున్న ప్రముఖ న్యాయవాది ప్రకాశం. ఆయన బహిరంగ సభలో తన వృత్తిని వదలివేస్తూన్నా నని ప్రకటించారు. ఇంతటి సంచలనాత్మక వార్తను మద్రాసు నుండి వెలువడే ఆంగ్ల దినపత్రికలు మారుమూల ప్రకటించాయి.

మీవంటి పలుకుబడిగల వ్యక్తులు నాలుగు పేజీలు ఆంగ్లపత్రిక మద్రాసు నుండి నడపలేరా అని ప్రకాశం గారిని ప్రశ్నించారు డాక్టరు పట్టాభి.

ప్రకాశంగారు దీన్ని ఒక సవాలుగా తీసికొని పత్రిక నిర్వహణకు పూను కొన్నారు. మద్రాసు నుండి స్వరాజ్య పత్రిక అక్టోబరు 1921 లో మద్రాసు బ్రాడ్వే లోని 155 నెం. ఇంటిలో ప్రారంభమైనది. తొలి సంపాదకుడు కేరళకు చెందిన ఆక్స్ఫర్డ్‌లో విద్యాభ్యాసం గావించిన కె యం. పణిక్కర్. హమీద్‌ఖాన్, ఎన్.ఎస్. వరదాచారి, శ్రీనివాసన్ బాస్కరన్ అందులో పనిచేసేవారు.

ప్రకాశంగారు "స్వరాజ్య" పత్రిక చేపట్టిన తొలిదినాలలో రాజాజీ పూర్తిగా సహకరించారు. గాంధీజీ ఉద్యమానికి పట్టుగొమ్మ అయిన స్వరాజ్య పత్రికకు అనతికాలంలో అధిక ప్రజాదరణ లభించింది. మొదటి నెలలోనే 5000 ప్రతులు, తరువాత పదివేల ప్రతులు అమ్ముడయ్యేది. ఈ విషయమే అహ్మదాబాదు రాష్ట్రములో గాంధీజీకి రాజాజీ వివరించారు. ప్రకాశంను ప్రశం సించారు మహాత్మా గాంధీ. రాజాజీ సూచనమేరకు తమిళంలో స్వరాజ్య ప్రారం భించ బడినది. ప్రముఖ దేశభక్తుడు శుద్ధానందభారతి దీని సంపాదకుడు.




మద్రాసులో స్వరాజ్య ప్రారంభించిన భవనం నెం 155 బ్రాడ్వే. నేడిది ప్రకాశం రోడ్.

తమిళంలో స్వరాజ్యపత్రికకు సంపాదకుఁబుగా నున్న కవి యోగి శుద్ధానంద భారతి. వీరి పూర్వులు తూర్పుగోదావరి జిల్లాలోని అమలాపురం నుండి వలస వెళ్ళినారు భారతి రమణమహర్షి జీవితం తమిళంలో 'రమణ విజయం' పేరిట రచించారు. తెనుగులో కూడా కొన్ని రచనలు చేశారు.

తెనుగులో వెలువడే 'స్వరాజ్య' తొలి సంపాదకులు ప్రముఖ కవి శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు. విశ్వదాత నాగేశ్వరరావు పంతులుగారు తాను ఆర్డరు చేసిన ప్రింటింగ్ యంత్రాలను సమకూర్చుకొనటంలో సహకరించారు. ప్రకాశంగారు స్వరాజ్యలో పనిచేసిన కుందుర్తి ఈశ్వరదత్తు, ఖాసా సుబ్బారావు, కోటంరాజు రామారావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు, జి. వి. కృపానిధి, నీలలరాజు వెంకటశేషయ్యగారు-వీరందరు తరువాత కాలంలో ప్రముఖ పాత్రికేయులుగా వాసికెక్కారు.

ప్రకాశంగారు నిర్వహించిన 'స్వరాజ్య' స్వాతంత్ర్య ఉద్యమానికి ఎనలేని సేవచేసింది. నిర్భయంగా వార్తలను అందించే 'స్వరాజ్య' అంటే ప్రభుత్వానికి దడ పుట్టేది.

ఒకసారి గుంటూరు విలేఖరి, జిల్లాలోనే గొప్ప భూస్వామి అయిన కుప్పుస్వామి చౌదరిగారిని గూర్చి "స్వరాజ్య"లో ఏవో కొన్ని వ్యాఖ్యలు చేశాడు. ఆ విలేఖరి తనపేరు వెల్లడి చేయలేదు. అతనిమీద చర్య తీసికోదలచాడు చౌదరి గారు. వాని వివరాలు కోరుతూ ప్రకాశంగారికి లేఖ వ్రాశాడు.

ప్రకాశంగారు చౌదరిగారికి జవాబు వ్రాస్తూ, ఒక వార్త పత్రికలో ప్రచురితం కాగానే సంపాదకునిదే పూర్తి బాధ్యత. మీరు ఏ చర్య అయినా ఎడిటర్ నయిన నా మీద తీసికోవాల్సి వుంటుంది అన్నారు. ప్రకాశంగారికి కుప్పుస్వామి గారు ఆప్తమిత్రులు ఆయన అంతటితో విరమించుకొన్నాడు.

నెల్లూరులో ప్రముఖ దేశ భక్తులు ఓరుగంటి వెంకటసుబ్బయ్య మద్య నిషేధ ప్రచారం గావిస్తూంటే చెప్పులతో ఆయన మీద చెలరేగారు దుండగులు.

స్వరాజ్య ఈ సంఘటనకు అధిక ప్రాధాన్యం ఇచ్చి ప్రచురించింది.

ప్రకాశం తన స్వార్జితం లక్షల రూపాయల స్వరాజ్య నిర్వహణలో వ్యయం చేశాడు. వివిధ కారణాల వల్ల రానురాను స్వరాజ్య నష్టాల ఊబిలో కూరుకొనిపోయింది. దానితోడు ఆనాటి మద్రాసు ప్రభుత్వం "స్వరాజ్య"ని బ్లాక్ లిస్ట్‌లో వేయడం, ఈయన మాటి మాటికి జైళ్ళకెళ్ళడం, కాంగ్రెస్ పనిమీద విరామం ఎరుగక దేశమంతా పర్యటించడం - ఇలాటివన్నీ తోడై "స్వరాజ్య" 1935 నాటికి మూతపడిపోవలసి వచ్చింది.

## కేరళలో ప్రకాశం ధైర్యసాహసాలు

మద్రాసు కేంద్రంగా చిరకాలం న్యాయవాదిగా వుంటూ వచ్చిన కారణాన ప్రకాశంగారికి అన్ని భాషలవారితో మంచి పరిచయాలుండేవి.

1921 లో కేరళలో కాంగ్రెసు సంఘం తొలిసారిగా ఏర్పాటైనది. అప్పటికే ఖద్దరు ఉద్యమం ఆ ప్రాంతంలో చక్కగా వ్యాపించింది.

ఒట్టపాళెంలో జరుగనున్న కేరళ కాంగ్రెసు సభకు అధ్యక్షత వహించేందుకు ప్రకాశంగారికి పిలుపువచ్చింది.

బ్రిటిష్ పాలకులకు నమ్మినబంటు హిచ్‌కాక్. ఆయన అప్పుడు అక్కడ పోలీసు ఉన్నతోద్యోగిగా వున్నారు. కాంగ్రెసు సభలు జరుగకుండా చూడటానికి అతడు శతవిధాలా కృషి చేశాడు.

రాముని మీనన్ అనే పెద్దమనిషిపై ముందుగా అత్యాచారం జరిగింది.

కేరళలో "మాప్లాలు" ముస్లింలలో ఒక తెగవారు. పోలీసులు వారిని హింసించి రెచ్చగొట్టారు. ప్రజల ఉద్రేకాలను ప్రకాశం కొంత శాంతింపచేశారు.

ఎలాగైతేనేమి, కాంగ్రెసు సభ జయప్రదమైనది. పట్టణంలో ఉద్రిక్త వాతావరణందృష్ట్యా సభకు విచ్చేసిన ప్రజలను చిన్న చిన్న గుంపులుగా వెనుక వైపునుండి పంపించడం క్షేమంగా వుంటుందని ఒక నాయకుడు సూచించాడు. ప్రకాశం దీనిని అంగీకరించలేదు. తాను ముందు నిలిచి ఊరేగింపు బయలుదేరదీశాడు.

ప్రకాశం గారి సాహసానికి ప్రజలు ముగ్ధులయినారు.

మరొకసారి ఇంతకంటె సాహసానికి పూనుకొన్నాడు ప్రకాశం.

కేరళలో చాలమంది మాప్లాలు రైతులవద్ద పాలేర్లుగా వుండేవారు. ఒక రైతు ఇంటిలో దొంగతనం జరిగింది. అతడు తన పాలేరు(మాప్లా)ను అనుమానించి తీవ్రంగా శిక్షించాడు.

ఇది పెద్ద రగడకు దారితీసింది.

మాప్లాలు మంచి పౌరుషవంతులు. వారి ఉత్సాహానికి పట్టపగ్గాలుండవు. దహనకాండ ప్రారంభంకాగానే మలబారులో 'మార్షల్‌లా' అమలుపరిచారు.

ఈ సంగతి తెలియని ప్రకాశం మలబార్‌లో తిరుగుబాటు వివరాలు సేకరిద్దామని బయలుదేరాడు.

షోరనూరు అనే పట్టణం చేరగానే ప్రకాశంను, ఆయన అనుచరుణ్ని నిలువనీడలేకుండా మిలిటరీ తరుమసాగింది. అక్కడినుండి శ్రమపడి ఒట్టపాళెం చేరుకున్నారు.

అక్కడినుండి అరవై మైళ్ళ దూరాన గల 'కాలికట్' కాలి నడకన చేరాలని వీరి పట్టుదల.

ఇరవై మైళ్ళు నడిచి ఒక చిన్న గ్రామం చేరారు. రోడ్లన్నీ కొట్టివేసిన చెట్లతో నిండి, దారి కంటకంగా తయారయినది.

మూడుదినాలు ప్రయాణం చేసి ప్రకాశం బృందం కాలికట్ చేరుకుంది "కన్పిస్తే కాల్చండి" అనే మిలిటరీవారి జులుం ఒకవైపు, కాంగ్రెసువారు తమ బద్ధవిరోధులని తలచే మాప్లా గుంపులు మరొకవైపు.

ప్రాణాలకు తెగించి ఈ యాత్ర చేయడం ఒక్క ప్రకాశం గారికే చెల్లిందని అందరూ ముక్కున వ్రేలు వేసికున్నారు.

వృద్ధాప్యంలోనూ ప్రకాశంను ఈ 'మొండితనం' వదలకపోవడం పరమాశ్చర్యం!

తెలంగాణాలో రజాకార్ దుండగాలు తీవ్రంగా సాగుతున్న దినాలవి.

ప్రజల కుత్తుకలు నిర్దయగా కత్తిరిస్తున్న రోజులవి.

కాంగ్రెసు జెండా ముందున్న కారులో ప్రకాశం రజాకార్ దళాల స్థావరంలో ప్రవేశించాడు.

రజాకార్‌లు గౌరవ మర్యాదలతో ప్రకాశంగారికి 'సెల్యూట్' చేశారు.

"దమ్ములుంటే సైన్యాలతో యుద్ధం చెయ్యండి, నోరులేని ప్రజలతోకాదు" అని వారిని హెచ్చరించిన ధీశాలి ప్రకాశం.




మద్రాసు నగరం రాయపేటలో 1933 లో "స్వరాజ్య" వెలువడిన భవనం—
హనుమాయమ్మ నిలయం.



మద్రాసు నగరం మందవెల్లిలో సెయింట్ మేరీ రోడ్‌లోగల
ప్రకాశం స్వగృహం (1912).

# రండిరా! అని గుండెనిచ్చిన ఉద్దండమూర్తి

దేశంలో అప్పుడు అమలులో వున్న రాజ్యాంగానికి ఏవైనా సవరణలు అవసరమా అని పరిశీలించడానికి ప్రభుత్వం 'సైమన్' అను దొర నాయకత్వాన ఒక సంఘాన్ని నియమించింది. దానినే ''సైమన్ కమీషన్" అంటారు. అందులో మన దేశము వారెవ్వరూ సభ్యులుగా లేరు. అందుచేత కాంగ్రెసు సైమను కమిషను ఎదుర్కొని ''మరలిపో'' (గో బాక్) అని చెప్పాలని నిర్ణయించింది.

కమీషన్ వారిని మద్రాసులో తగినరీతి ఎదుర్కొనేందుకు ఆంధ్ర, తమిళ నాడు కాంగ్రెసు సంఘాలు పూనుకున్నాయి.

ఆంధ్ర కాంగ్రెసు సంఘానికి అధ్యక్షులు ప్రకాశం. తమిళనాడు సంఘా ధ్యక్షులు శ్రీనివాస అయ్యంగార్. ఇద్దరూ కేంద్ర శాసనసభ సభ్యులుగా ఢిల్లీలోనే వుండేవారు.

ఇద్దరూ మద్రాసు పోవటానికి నిర్ణంచుకున్నారు. చివరి నిముషంలో శ్రీని వాస అయ్యంగార్ విరమించుకున్నాడు.

ప్రకాశం మద్రాసు చేరేసరికి నగరం పోరాటానికి సిద్ధంగా వున్నట్లు కన్పించింది. ప్రజానీకం ఎంతో ఉత్సాహంతో హర్తాళ్ జరిపారు. పది మైళ్ళ చదరంగల మద్రాసు మహానగరం జనంతో క్రిక్కిరిసిపోయింది.

ప్రభుత్వం కన్నుచెదిరింది. రెచ్చిపోయిన అధికారులు కాల్పులకు ఉత్తర్వు చేశారు. ఒక యువకుడు నేలకొరిగాడు.

అప్పుడు చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ పండలే ఒకనాడు ప్రకాశంగారి వద్ద జూనియర్ న్యాయవాదిగా పనిచేసినవాడే! సిపాయిలు హైకోర్టు వద్ద ప్రకాశం గారిని ఆపుచేసి ముందుకు సాగనివ్వలేదు. చనిపోయిన వ్యక్తి శరీరం

చూసితీరాలి అన్నాడు ప్రకాశం. ప్రకాశం గుండెకు బారుచేసి తుపాకీ పట్టుకున్న సిపాయి "మీరు దౌర్జన్యంగా ముందుకువెడితే కాల్చవలసి వుంటుంది" అన్నాడు.

"సరే, నీ పని కానియ్ ధైర్యం వుంటే" అని ప్రకాశం గుండె చూపించాడు.

ఎత్తిన తుపాకి క్రిందికి దిగింది 'ప్రకాశంకీ జై' అన్న ప్రజల ఘోష మిన్నుముట్టింది.

# కాంగ్రెసుపై ప్రకాశంగారి తిరుగుబాటు

1929 డిసెంబరులో పండిత జవహరులాల్ అధ్యక్షతన జరిగిన లాహోరు కాంగ్రెసు రెండు ముఖ్యమైన తీర్మానాలు చేసింది. ఒకటి - సంపూర్ణ స్వరాజ్యం కాంగ్రెసు లక్ష్యమని; రెండు-దానిని సాధించుటకు కాంగ్రెసువాదులు కౌన్సిల్‌లో సభ్యత్వాన్ని వదలుకొని స్వాతంత్ర్య పోరాటం. సాగించాలని మరొక తీర్మానం భారత స్వాతంత్ర దినాన్ని 1930 జనవరి 26 న పాటించాలని.

ఆ దినాల్లో ప్రకాశంగారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు, కేంద్ర శాసన (ఢిల్లీ) సభ్యులున్నూ. లాహోర్ తీర్మానం ఆయనకు అంగీకారం కాలేదు. దానిని వ్యతిరేకించాడు కూడా. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి, కేంద్ర శాసనసభ సభ్యత్వానికి రాజీనామా ఇవ్వడమే గాకుండా కేంద్ర శాసన సభకు తిరిగి స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేసి ఏకగ్రీవంగా ఎన్నికైనాడు.

ప్రకాశం కేంద్ర శాసన సభలో ప్రవేశించే నాటికి (1930 మార్చి) గాంధీ గారు దండి సత్యాగ్రహం యావద్భారతాన్ని కదిలించివేసింది. కాంగ్రెసు నుండి రాజీనామా చేశాడన్నమాటే కానీ గాంధీ స్ఫూర్తి ఆయనకు ఉత్తేజం కల్గిస్తూనే వున్నది.

ప్రకాశంగారు కేంద్ర శాసనసభలో సంచలనం కలిగించే ప్రకటన చేశాడు. తానూ ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనబోతున్నానని కేంద్ర శాసన సభ సభ్యత్వానికి రాజీనామా యిచ్చి, మద్రాసు చేరాడు ప్రకాశం. ప్రకాశంగారితోపాటు మరి కొందరు సభ్యులు కూడా తమ సభ్యత్వాలకు రాజీనామాలిచ్చారు.

# స్వదేశీ ఉప్పు

మద్రాసులో సత్యాగ్రహ వాతావరణం లేదని భావించిన రాజాజీ 'వేదారణ్యం'చేరి అక్కడ సత్యాగ్రహం చేశారు.

మద్రాసు నగర ప్రజల నాడి ప్రకాశంగారికి తెలిసినట్లు మరొకరికి తెలియదు. 1907 నుండి బారిస్టరుగా నున్న పంతులుగారి పలుకుబడి చెన్న పట్టణం ప్రజలకు చక్కగా తెలుసు.

ప్రకాశం నగరంలోనే సత్యాగ్రహం నిర్వహించదలిచారు. మైలాపూరులో 'ఉదయవనం' పేరు గల విశాల భవనాన్ని నెలకు రెండువందలకు బాడుగకు తీసికున్నారు. నిర్వహణ బాధ్యత గుమ్మిడిదల దుర్గాబాయమ్మకు ఒప్పజెప్పి, ఆంధ్రదేశంలో ఉద్యమధోరణి పరిశీలించేందుకు పంతులుగారు బయలుదేరారు.

కృష్ణా గోదావరి జిల్లాలో సుడిగాలిలా తిరిగారు. మచిలీపట్నంలో ఏర్పాట్లు ఆయనను ముగ్ధుల్ని చేశాయి.

పల్లపు భూములను మడులు మడులుగా చేసి వాటిలో సముద్రపు నీరు మళ్ళించి సహజమైన ఉప్పు పండించారు. అలా తయారైన ఉప్పు రెండు బస్తాలు తన కారులో వేయించారు ప్రకాశం.

అక్కడి నుండి స్వంత ప్రాంతమైన ఒంగోలు దగ్గరలోని దేవరంపాడు శిబిరం దర్శించి ప్రజలను ఉత్సాహపరచి పంతులుగారు పట్నం చేరుకున్నారు. అప్పటికే ఉదయవనం సత్యాగ్రహులతో నిండిపోయింది. ఒక్కొక్క ముఠా (Batch)కు పదునైదు మంది చొప్పున వారందరినీ విడదీశారు.

మద్రాసు పోర్టు ముందటి మైదానంలో తొలిసారిగా బహిరంగ సభ జరిపారు. ముందుగా మాట్లాడిన న్యాయవాదులు కె. భాష్యం, బషీర్ అహమ్మద్ కొంత నిరాశాధోరణితో ప్రసంగించారు. తరువాత ప్రకాశంగారు మాట్లాడారు. "మద్రాసు మహానగరం ఇంకా సజీవంగా చైతన్యవంతంగా వున్నది. స్వాతంత్ర్య పోరాటంలో ఇచటి పౌరులు మరెవ్వరికీ తీసిపోరు." ప్రకాశం గారి ఉత్తేజిత పూరిత ప్రసంగం ప్రజలను కార్యోన్ముఖులను చేసింది. ప్రజలు జేజేలు పలికారు.



ఉదయవనం సత్యాగ్రహ శిబిరం

మద్రాసు ఉప్పుసత్యాగ్రహంలో తొలివిడత సత్యాగ్రహులకు దేశోద్ధారక నాగేశ్వరరావు నాయకత్వం వహించారు మహిళలు నాయకులకు హారతులిచ్చి జోహార్లు చెప్పారు.

మద్రాసు నలుమూలల్లో ఊరేగింపు తీసి చివరన సముద్రతీరాన ఉప్పు తయారుచేయసాగారు.

ఆ రోజుల్లో జాతీయవారంగా ఏప్రిల్ 6-13 జరుపుకునేవారు. ఆ వారాంతాన, అనగా 1930 ఏప్రిల్ 13న తొలి ఊరేగింపు స్వరాజ్య కార్యాలయంనుంచే ప్రారంభమై ఈ కార్యక్రమం చాలా దినాలు సాగింది.

ఒకనాడు సభ ప్రారంభం కానున్నదనగా మశూచితో పడకబెట్టినప్రకాశం గారి రెండవ కుమారుడు హనుమంతరావు మరణించాడని వార్త వచ్చింది. తొణకని ఆంధ్రకేసరి వాణి ఇలా గర్జించింది: "ఇదే నిజమయితే, ఈ సత్యాగ్రహంలో త్యాగం చేసిన తొలి వ్యక్తి నా కుమారుడే కాగలడు."

ఇంటికి వెళ్ళేసరికి తన కుమారుడు సజీవుడుగా ఉండడం ప్రకాశంగారికి ఆనందం కల్గించింది.

అయితే, హనుమంతరావు తర్వాత మద్రాసు నగరంలో విదేశీ వస్త్ర దుకాణాల వద్ద పికెటింగ్ చేస్తూ అరెస్టయి, ఒక సంవత్సరం కఠిన శిక్షను పొందాడు.

మరొకనాటి సభలో గుర్రాలపై విచ్చేసిన పటాలాలు ప్రజలను భీతావహులను చేసినవి. చాలమంది దిక్కుతోచక పరుగెత్తసాగారు. గాయపడిన ఒక వ్యక్తిని వేదిక పైకి కొనివచ్చారు. గంభీరస్వరంతో ప్రకాశం పోలీసు రౌతుల ఆగడాలను దుయ్యబట్టారు. అప్పటికి వెనుదిరిగినా, పోలీసు బలగం పంతులు గారిని అరెస్టు చేయ నిశ్చయించింది.

ఆ ముహూర్తం రానే వచ్చింది. 1930 ఏప్రిల్ 3 న 11 గంటలకు ఇంటివద్దే కార్యక్రమం సాగిస్తూండగా, పోలీసు డిప్యూటీ కమీషనరు తన

సిబ్బందితో ప్రకాశం ఇంటికే వచ్చేశాడు. తంగచ్చమ్మ అనే ఒక వృద్ధ మహిళా సత్యాగ్రహి స్వదేశీ ఉప్పుతో నిండిన పెద్ద పళ్ళెం తన చేతులతో పట్టుకొని వుండగా దానిని తన కిమ్మన్నాడు పోలీసు అధికారి ''ఇది నీ సొత్తుకాదు,సముద్రపు నీటితో మేము కష్టబడి తయారుచేసికొన్నాం" అని, పంతులుగారితోపాటు తననూ అరెస్టు చేయమని తంగచ్చి ఆ అధికారిని నిలదీసింది.

ప్రకాశంగారిని జార్జిటౌన్ మెజిస్ట్రేట్ కోర్టులో ప్రవేశ పెట్టారు. ఆయనపై ఆరోపణలు అధికారి ఏకరవు పెడుతున్నాడు.

"ఇక చాలులే ఆపు. అన్నీ నేను ఒప్పుకొంటున్నాగా!" అని పంతులుగారి హుంకారం.

శిక్ష ఒక ఏడాదిగా మెజిస్ట్రేట్ ప్రకటించగా ప్రకాశం ఆనందించారు. ఆ తర్వాత కొన్నాళ్ళకు తంగచ్చి అమ్మాల్‌గార్కి ఆర్నెల్లు శిక్ష విధించారు.

ప్రకాశంగారి భార్య శ్రీమతి హనుమాయమ్మగారు గూడా స్త్రీలను కూడగట్టి సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. మద్రాసు జార్జిటౌను సౌందర్య మహల్‌లో జరిగిన ఒక పెద్ద సభకు అధ్యక్షత వహించింది గూడా. ఉద్యమంలో అష్టకష్టాల నెదుర్కొంటున్న తన భర్తకు అండగా నిల్చి ఆయనకు కొండంత బలాన్నిచ్చింది ఆ మహా ఇల్లాలు.

ప్రకాశంగారు అరెస్టయిన పిమ్మట వారి ఇంటి పరిస్థితి దయనీయంగా వుండింది. కుమారుడు హనుమంతరావు ఆరోగ్యం ప్రమాదకర స్థాయికి చేరుకున్నది. తినటానికి తిండి, కట్టడానికి బట్ట లేకుండాపోయినవి. బకాయిలున్నందున విద్యుత్తు, నీటి సప్లైలు నిలిచిపోయినవి. దృఢచిత్తం కల దుర్గాబాయి ప్రకాశం గృహచిత్రం చూచి కంట తడి పెట్టింది. తన బంగారు గాజులు రు. 1200 లకు అమ్మి ఆ కుటుంబాన్ని కాపాడింది.

మద్రాసులో సత్యాగ్రహం సఫలం కాదన్నవారి ఆలోచనలు తప్పని రుజావు చేశారు ఆంధ్రకేసరి.

తనతో తొలుత విభేదించిన న్యాయవాది కె. భాష్యం సైతం సత్యాగ్రహంలో పాల్గొని జైలులో కలసికొని పంతులుగారికి ఆనందం కల్గిలచాడు.

ప్రకాశంగారి ఆశించినట్లు మద్రాసు మహానగరం మరొక "దండి"గా నిలిచి తల ఎత్తుకోగలిగింది.

ప్రకాశం, నాగేశ్వరరావు, దుర్గాబాయమ్మల కృషి చిరస్థాయిగా నిలచింది.

# మద్రాసు కుట్రకేసు

1932 లో తిరుచినాపల్లి జైలులో ప్రముఖ విప్లవకారులు సురేంద్రమోహన్ ఘోష్, జీవన్‌లాల్ చటర్జీ, ముకుందలాల్ సర్కార్ నిర్బంధింపబడినారు. వీరి జైలులోనే ప్రముఖ పాత్రికేయుడు, భాషావేత్త శ్రీ తిరుమల రామచంద్ర వుండే వారు.

ముకుందలాల్ సర్కార్ ప్రభృతుల మీద కుట్రకేసు మోపబడి దేశమంతటా ''మద్రాసు కుట్రకేసు''గా ప్రసిద్ధి కెక్కింది.

ఆ దినాలలో తిరుమల రామచంద మద్రాసు సంస్కృత కళాశాల విద్యార్థి ప్రభుత్వం వీ స కుట్ర కేసులో ప్రాసిక్యూషన్ సాక్షిగా వేసికొనినారు

ముద్దాయిలను కాపాడటానికి ఆంధ్రకేసరి నాయకత్వాన బచ్చు జగన్నాథదాసు కె భాష్యం, పి. రామమూర్తి మున్నగు న్యాయవాదులతో డిఫెన్సు కమిటీ ఏర్పాటైనది

1921 లో గాంధీ పిలుపుమేరకు ప్రాక్టీసునుండి విరమించిన ప్రకాశంగారు తన నల్లకోటు బూజు దులిపి స్పెషల్ కోర్టులో ప్రవేశించేసరికి అందరి గుండెలు ఝల్లుమన్నాయి.

1934 జనవరి 8 న మొదటి ప్రాసిక్యూషన్ సాక్షి శ్రీ తిరుమల రామచంద్రను బోనులో నిలిపారు. ప్రకాశం అతనిని ఇలా ప్రశ్నించారు;

ఏమయ్యా! ఏమి చదువుచున్నావు?
సంస్కృతమండీ.
మైలావూరు సంస్కృత కళాశాలలోనా?
ఔనండీ!
రివాల్వరు ఎన్నడైనా చూచావా?
.... .... ....
ధనుర్బాణాలు గూర్చి చదివి వుంటావు?
ఔనండీ!
పోలీసువారు ఆరోపిస్తున్న కుట్రల సంగతి నీకేమైనా తెలుసా?
తెలీదండి!

ప్రకాశంగారు కోర్టువైపు తిరిగి "యువర్ ఆనర్, ఏదో గురుకులంలో చదువుచున్న సంస్కృత విద్యార్థిని ఈ కేసులో నిందితులున్న కారాగారంలో వున్నాడన్నంత మాత్రాన ప్రాసిక్యూషన్ సాక్షిగా వేసికోవడం ఏమిన్యాయమండి?" అన్నారు.

నిందితులు, ప్రేక్షకులు గొల్లున నవ్వారు.
పోలీసులు క్రుద్ధులయినారు.
రామచంద్రను బోనునుండి దిగిపొమ్మన్నారు.

ఉరిశిక్షలనుండి తప్పించుకొని కొద్దిపాటి జైలుశిక్షలతో బయటపడిన ముద్దాయిలు ప్రకాశంగారికి కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

# కేంద్ర శాసన సభలో

1926 లో కేంద్ర శాసన సభకు ఎన్నికలు జరిగాయి. కృష్ణా, గోదావరి జిల్లాల స్థానానికి ప్రకాశంగారు కాంగ్రెస్ అభ్యర్థిగా నిలిచారు. ఆయన ప్రత్యర్థి దివాన్ బహదూర్ మోచర్ల రామచంద్రరావు మిక్కిలి పలుకుబడిగల వ్యక్తి. అయినా ప్రకాశంగారే పది వేల ఓట్ల మెజారిటీతో గెలిచారు,

కేంద్ర శాసన సభలో మోతీలాల్ నెహ్రూ కాంగ్రెస్ నాయకుడు. సభాధ్యక్షులు విఠల్‌బాయిపటేల్ ప్రకాశంగారికి ఆప్తమిత్రులు. పోలీసులు శాసన సభలో కాలుమోపకుండా కట్టడి చేసిన గౌరవం వీరిదే!

ప్రకాశంగారి సలహాపై ఆయన తన పదవికి రాజీనామాచేసి ఉప్పు సత్యాగ్రహంలో చేరారు. అనారోగ్యం కారణంగా జైలులో చాలా కష్టాలుపడి విడుదలయిన కొద్దిదినాలకే మరణించాడు! అందుకు ప్రకాశం మిక్కిలి బాధపడినాడు.

# 1937 ఎన్నికలు

**1937** ఎన్నికలలో మద్రాసు నగరం నుండి కాంగ్రెస్ అభ్యర్థిగా ప్రకాశంని ఎంపిక చేయడం తప్పనిసరి. ఈ భావం అందరిలోనూ ఉండేది. కానీ ఆంధ్రులకు నగరంలో పలుకుబడి తగ్గించాలని తమిళనాయకుల పట్టుదల. అందువల్ల ప్రకాశంగారి పేరును అభ్యర్థుల జాబితాలో చేర్చలేదు.

ఆ పరిస్థితుల్లో అధిష్ఠాన వర్గం నిర్ణయించాల్సి వచ్చింది. సర్దార్ పటేల్ బొంబాయిలో తుది నిర్ణయం తీసుకుంటారనీ ప్రకాశంను కూడా అక్కడికే రమ్మని కోరారు.

ఆనాటి రైలు ప్రయాణంలో రాజాజీ, పటేల్ ఒక పెట్టెలో కూర్చున్నారు. ప్రకాశంగారు అదే రైలులో మరో పెట్టెలో కూర్చున్నారు.

ముందుగా కొండా వెంకటప్పయ్య రైలులోనే పటేల్‌ను కలుసుకొన్నారు. దేశభక్తునికి ఆంధ్రకేసరికి కొద్ది మనస్పర్థలుండేవి. రాజాజీ వెంకటప్పయ్యను ప్రశ్నించారు: "ప్రకాశం అసెంబ్లీ ఎన్నికకు అభ్యర్థిగా నిలపడంలో మీ అభిప్రాయం ఏమిటి?"

"అదేంమాట? ప్రకాశంలేకుండా అసెంబ్లీ ఏమిటండీ" అని వెంకటప్పయ్య గారి సమాధానం.

రైలు రేణిగుంట చేరగానే అనంతశయనం అయ్యంగారు ప్లాట్‌ఫాం మీదికి రావడం ప్రకాశం చూశారు ప్రకాశం ఆయనను పిలిచి 'అంత హడావుడి దేనికి? అన్నారు. పటేల్‌గారిని చూడాలన్నారు అనంతశయనం. పటేల్ ఉన్న రైలు పెట్టి చూపారు ప్రకాశం.

రాజాజీ తిరిగి అనంతశయనాన్ని అదే ప్రశ్న అడిగారు.

"అసలు ఈ ప్రశ్న ఎట్లా వేస్తున్నారు? ప్రకాశంలేని అసెంబ్లీ అసలు ఊహించలేం!" అని అయ్యంగారు జవాబు చెప్పారు.

కాంగ్రెసుకు మెజారిటీ వచ్చింది. ఉప్పుసత్యాగ్రహంలో మద్రాసు ప్రతిష్ఠ కాపాడిన ప్రకాశం ఒకవైపు, మద్రాసులోగాక వేదారణ్యంలో సత్యాగ్రహం నిర్వహించిన రాజాజీ ఒకవైపు నాయకత్వానికి అభ్యర్థులు. పరిస్థితిని గమనించిన ప్రకాశమే రాజాజీ పేరును ముఖ్యమంత్రిగా ప్రతిపాదించారు.

సాంబమూర్తి స్పీకర్‌గానూ, ప్రకాశం రెవెన్యూ మంత్రిగానూ పదవులు స్వీకరించారు.

# రెవిన్యూమంత్రిగా ప్రకాశం

ఉద్యమకాలంలో ఉద్యోగాలు కోల్పోయిన నూటఇరవై తొమ్మిదిమంది గ్రామాధికారులను తిరిగి నియమించాడు

దండి సత్యాగ్రహం వస్తువుగా తీసిన చలన చిత్రాలపైగల ఆంక్షలు తొలగించాడు.

జమీందారీ రద్దు బిల్లును గూర్చి తయారుచేసిన నివేదిక ప్రకాశంగారు అసెంబ్లీలో ప్రవేశపెడతారని తెలిసి తెలుగు జిల్లాల వేలాదిమంది రైతులు మదరాసు వచ్చారు. ప్యాసులేనిదే అసెంబ్లీలోనికి రానివ్వరు. అసెంబ్లీ బైటవున్న వేలాదిమందికోసం స్పీకర్ సాంబమూర్తి మైక్రోఫోనులు పెట్టించాడు. ఆమాదిరి మునుపెన్నడూ జరిగి ఉండలేదు. దానిని కాదనే ధైర్యం ఎవ్వరికీలేదు.

సేల్సుటాక్సు బిల్లు రివిన్యూ శాఖకు సంబంధించినది. అయినా అది రాజాజీ చూస్తూ వున్నాడు. స్థానిక వ్యాపారస్థులకు ఇబ్బంది కలిగించే నిబంధనలు అందులో వున్నట్లు ప్రకాశం దృష్టికి వచ్చింది. నేరుగా సెలెక్టు కమిటీలో వచ్చి కూర్చొన్నాడు. రాజాజీ మేధావి కదా!

''అసలు ఈ బిల్లు ప్రకాశం చేపట్టవలసినది. నావంతుకు వచ్చింది" అన్నాడు రాజాజీ. ప్రకాశం చిక్కులలో పడినట్లయింది.

''ఏమైనా స్థానికులకు నష్టం రాకుండా చూడండి"అని వారందరినీ హెచ్చరించి బైటకు నడిచాడు ప్రకాశం.

ఆయన మంత్రిగా చేసిన పెద్దపని జమిందారీ రైతుల విచారణ సంఘానికి తానే పెద్దయై శ్రమించి 18 సంపుటాల నివేదిక తయారుచేసినాడు. కళా వెంకటరావుగారు దీనిని ''మహాభారతం''గా పేర్కొన్నారు. నాటి శాసన సభ్యులు శ్రీకృష్ణమాచారి మొదలగువారు ప్రకాశం మేధస్సును, పట్టుదలను మిక్కిలి ప్రశంసించినారు.

ఈ చర్చలలో జరిగిన ఒక చమత్కారము:

ప్రకాశం: రెగ్యులేషన్‌లో ఉండే 'భాష' ప్రివీ కౌన్సిల్ వారికి సరిగా అర్థమైనట్లులేదు.

కె వి. రెడ్డినాయుడు: అయ్యా! ప్రివీ కౌన్సిల్ వారంతా ఇంగ్లీషువారే కదా! వారి ఇంగ్లీషు వారికే అర్థం కాలేదంటారా?

ప్రకాశం : అయితే, రెడ్డి నాయుడుగారికి తెలుగు గ్రంథాలన్నీ అర్థమైనవా?

సభ్యుల నవ్వులతో సభ మారుమ్రోగింది. రెడ్డినాయుడు, ప్రకాశంగార్లు చిన్ననాటి సహాధ్యాయులు

పదవిలో వున్నది కొద్దికాలమయినా రెవిన్యూ మంత్రిగా ప్రకాశం అద్భుత విజయాలు సాధించారు.

# జైలు సంఘటనలు

ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టయిన ప్రకాశం గారిని పదిహేను దినాలు మద్రాసు పెనిటెన్షరీ జైలులో వుంచారు. నిర్విరామంగా తిరగడం మూలంగా శరీరంతో ఉష్ణం ఎక్కువై ఆయన ఒంటినిండా కురుపులు లేచాయి.

సరిగా దుస్తులు వేసుకోని సమయంలో జైలు సూపర్నెంటు తనిఖీకి వచ్చే శాడు. ప్రకాశం లేచి నిలబడలేకపోయినాడు అధికారి తనపట్ల అమర్యాదగా ప్రవర్తించాడని కస్సుమన్నాడు.

ముందుగా తెలుపకుండా రావడం అధికారికి తగిన పనియేనా అని ప్రకాశం నిలదీశాడు. అధికారి చప్పబడి జారుకున్నాడు.

తిరుచినాపల్లి జైలులో ఒక వార్డరు ఖైదీని తోలు బెల్టుతో చావబాదటం, ఖైదీ హాహా కారాలు చేస్తూండడం ప్రకాశం చూచాడు.

'ఆపు' అని ప్రకాశం బిగ్గరగా గర్జించేసరికి వార్డరు బెల్టు అక్కడే పారేసి పరుగులంకించుకున్నాడు.

మరొకసారి ఆంధ్ర యువఖైదీ జైలులో చనిపోయాడు. తగిన వైద్య సౌకర్యం కల్గించనందుననే అతడు మరణం పాలైనాడని వదంతి ప్రబలింది. అతని బంధువులు దూర ప్రాంతంలో వున్నందున వెంటనే వచ్చే అవకాశము లేకపోయింది.

''భారత స్వాతంత్ర్యం" పేరిట ప్రకాశం గారే అతనికి దగిన సంస్కా రాలు ఏర్పాటుచేశారు. ఆ యువకుని త్యాగాన్ని ప్రశంసిస్తూ ప్రకాశం ఉత్తేజకర ప్రసంగం చేశారు.

గుంటూరు జిల్లా భట్టిప్రోలు గ్రామస్థులు శ్రీ సంగం బాలకోటయ్య తన మిత్రులతో తొలిసారిగా 1930 లో తిరుచినాపల్లి జైలుకు వచ్చారు. వారికిచ్చే "దేవతాపులుసు" (రాళ్ల,పురుగులు కలిసిన సాంబారు) అర్భకులకు దుర్భరమైనది.

వారంతా జట్టుగా ప్రకాశంగారి వసతి (సెల్లు) వద్దకు వెళ్ళారు.

ఏమిరా అన్నాడు పంతులు

జైలు తిండి సయించటంలేదని నస్గిగారు.

ఒక్క క్షణం ఆలోచించి, సరే పొండి అన్నాడు. పంతులుగారు తమకు వచ్చిన ఆహారం, పాలు, రొట్టె వారికి పంపాడు.

మర్నాడు జట్టు అంతా తిరిగి ప్రకాశం ఎదుట నిలబడినారు.

ఏమిరా... మళ్ళీ వచ్చారు అన్నాడు ప్రకాశం.

"మా తిండి మేమే తింటాం, మాకోసం మీరు పస్తువుంటే భరించలేం అని విలపించారు యువకబృందం.

అదే జైలులోని (తిరుచి) మరొక సంఘటన. ఒకనాడు జైలు సూపరెన్టెంట్ ప్రకాశంగారిని పిలువనంపాడు. ఖైదీగా ప్రకాశం ఆయన ఎదుట కూర్చొనే అవకాశంలేదు.

ప్రకాశంగారికి తన హోదా, స్వాభిమానం గుర్తుకొచ్చినవి. ఆ గదిలోనే ఒక మూలగా వున్న కుర్చీ తానే తెచ్చుకొని అధికారి ఎదురుగా కూర్చొని మాటలాడ నారంభించాడు.

ఇది ఏ సూపరెన్టెంట్ కైనా కష్టం కలిగించే పనే!

ఫలితంగా ప్రకాశంగారిని కన్ననూరు జైలుకు మార్చారు.

తిరుచినాపల్లి జైలులో ప్రకాశంగారి సెల్లు ముందు విశాలమైదానంలో చెట్లనీడన యాభై మంది సమావేశమై ఆంధ్రమహాభారతం,భాగవతం, భగవద్గీతలు పఠిస్తూ వుండేవారు. వాల్మీకి రామాయణం కలచపీడు వెంకట్రమణాచార్యులు చదువుతూవుంటే ప్రకాశంగారు వ్యాఖ్యానం చేస్తూవుండేవారు.

అమరావతి జైలులో కూడా కల్లూరు సుబ్బారావు మహాభారతం చదివేవాడు. ప్రకాశం, వి. వి. గిరి, విశ్వనాథం ప్రభృతులు ఆనందించేవారు.

# వేలూరు జైలు ముచ్చటలు

"ఒకచోట రామాయణ కథా శ్రవణ పుణ్య
పదములు - వాల్మీకి అదిరిపడగ;
ఒకచోట భాగవతోదంత వ్యాఖ్యాన
తీవ్రత - పోతన్న దిగులుపడగ;
ఒకచోట భారతీయ కవితా వాహినీ
స్నాతులై కవులెల్ల సంచలింప;
ఒకచోట సామ్యవాద కలకలార్భటి
రవములు - లెనినును లజ్జపరుప,
రాజితాచార్య శాసన రక్షితమ్ము
దీప్రకాశ విభాషిత తీవ్రపణితి
విశ్వవేదాంత పీఠికా, విలసితమ్ము
రాయవేలూరి నగర కారాగృహమ్ము."

"గీతార్థసార విఖ్యాత ప్రదాతృ వి
ద్యాలయ ఘోషంబు లలము కొనగ,
లోకాభి రామయణాకలనంబున
చీకటి దర్బార్లు చెలుగుచుండ,
నెమ్మి ప్రేక్షక వాహినీ చిత్రవర్ణాల
సంధ్యానురాగమ్ము సంతసిల్ల,
పాఠక జన బృంద పాండిత్య సేచనన్
తింత్రిణీ శవరాశి తీపి గనగ,
విశ్వవేదాంత పీఠికా విస్తరంబు
తెలుగు తమిళ కర్ణాట కేరళ వివేత
లలవి నలరారు పరమ లీలాగృహమ్ము
తిరుచునావల్లి కేంద్ర ఖైదీల గృహమ్ము." (19-1-1941)

(నా జీవితయాత్ర - టంగుటూరి ప్రకాశం; చతుర్థ ఖండం, అనుబంధ సంపుటి; తెన్నేటి విశ్వనాథం, EMESCO, సికింద్రాబాద్, 1972, పుటలు 642 - 4.)

# యుద్ధ కాలంలో

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో మనదేశ రాజకీయాలు విచిత్రంగా పరిణమించినవి. జపానువారు విశాఖ, కాకినాడ ప్రాంతాలలో బాంబులు వేసి ప్రజలలో భీతావహం కల్గించారు.

కాంగ్రెసు - ముస్లింలీగు విభేదాలు అధికం సాగినవి. ఈ దశలో రాజాజీయే దేశవిభజన ప్రతిపాదన లేవదీశాడు.

క్రిప్సు రాయబారం విఫలమయినది. గాంధీజీ వ్యక్తి సత్యాగ్రహం విజయవంతమై, తరువాత చేపట్టాల్సిన కార్యక్రమంకోసం ఆలోచన సాగించాడు.

ఈ దశలో ప్రజలలో ఆత్మవిశ్వాసం కల్గించడం తక్షణ కర్తవ్యంగా తలపోశాడు ప్రకాశం. స్వయంగా స్కౌటు దుస్తులు ధరించి మద్రాసులోని స్వరాజ బిల్డింగ్సులోనే కాంగ్రెసు సేవాదళ్ శిబిరాలు ఏర్పాటుచేశారు.

**1942** మార్చి నెలలో బెజవాడలో జరిగిన రాష్ట్ర కాంగెసు అధ్యక్ష పీఠం నుంచి ప్రకాశంగారు ఆత్మరక్షణకు, దేశరక్షణకు ప్రజలు సంసిద్ధులు కావాలని పిలుపు నిచ్చారు. విద్యార్థి యువజన సంఘాలు రంగప్రవేశం చేసి ప్రకాశంగారి విజ్ఞప్తిని ఆచరణలో పెట్టడానికి కృషి చేశాయి. **1942 మే లో** అలహాబాదులో, జూలైలో వార్ధాలో జరిగిన అఖిల భారత కాంగెసు కమిటీ తెల్లదొరతనంపై తుది పోరాటానికి సంసిద్ధం కావాలనే నిర్ణయానికి వచ్చారు.

జాతీయోద్యమం ఉవ్వెత్తున లేచి బొంబాయిలో ఆగస్టు 6-8 లలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సభలు హెచ్చుస్థాయిలో పోరాటానికి దోహదం చేసినవి.

# ఆంధ్రా సర్క్యులర్

ఈలోగా మరొక ఆశ్చర్యకర సంఘటన తటస్థించింది.

గాంధీజీ చివరి పోరాటం **Do or die** విజయమో! వీరమరణమో! ఈ భీషణ నినాదం ముందుంచుకొని మహోద్యమం అణుమాత్రం హింస లేకుండా జరగాలి! ఒకవైపు ఉత్తుంగ తరంగాలవలె చెలరేగే ఉద్యమం - మరొకవైపు గాంధీజీ అహింసాయుత అడ్డుకట్టలు. ఇది ఇలా వుండగా గాంధీజీ శంఖారావం చేయగనే నాయకులందరూ జైలుపాలు కావడం తథ్యం.

మరి ప్రజలకు నాయకులుండరు. ఆదేశాలిచ్చేవారుండరు. అప్పుడు ఉద్యమం ఎలా నడువగలదు? అన్నీ ప్రశ్నలే! అన్నీ ధర్మసందేహాలే!

ఈ నేపథ్యంలో 1942 జులై 28 న డాక్టరు పట్టాభిగారు ముందుకు వచ్చారు. బందరులోని తన ఇంటిలో రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా వున్న ప్రకాశం గారి ప్రమేయం ఏమీ లేకుండా జిల్లాల కాంగ్రెసు నాయకులందరినీ పిలిపించారు. రహస్యంగా తాను రూపొందించిన కార్యక్రమం ప్రవేశపెట్టారు. (ఆంధ్రా సర్క్యులర్‌గా ప్రచారం అయినది) ఇతరుల మాదిరే ప్రకాశం ఆ సభలో పాల్గొనినారు. క్విట్ ఇండియా ఉద్యమంలో భాగంగా ప్రజలు చేయ వలసిన ప్రభుత్వ వ్యతిరేక హింసాయుత చర్యలన్నీ ఇందు పేర్కొనబడినాయి. ఇది కాంగ్రెసు అధిష్ఠానవర్గ ఆదేశమనే భావన కల్పించబడింది. కాని, బొంబా యిలో చర్రితాత్మకమైన ఆగస్టు సమావేశం జరుగకముందే ఈ సర్క్యులర్ జారీ చేయబడినది ఇది రహస్యమా, బహిరంగమా? అన్న మీమాంస ఆ తరువాత గానీ బయలుపడలేదు.

ప్రకాశం గారికి ధర్మ సంకటం ఏర్పడింది! తాను అధ్యక్షుడుగా వుండగా మరొక అగ్రనాయకుడు దీనికి పూనుకోవడం - దీనిని ఆమోదించవలెనా, తిరస్కరించవలెనా! ఆ సందర్భంలో ఏవిధంగా చేసిన చిక్కే.

1942 ఆగస్టు 7, 8 తేదీలలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సమా వేశంలో ప్రకాశం హాజరయినారు. మహాత్మా గాంధీ మహోపన్యాసం ముగిస్తూ "నేను కాంగ్రెసును తాకట్టు పెట్టాను. కాంగ్రెసు ముందున్న సమస్య ఒక్కటే Do or die" అన్నాను.

ఆ సమావేశంలో మహాత్ముని తీర్మానాన్ని బలపరుస్తూ ప్రకాశంగారు "ఈ ఉద్యమం భారత స్వాతంత్ర్యం కోసం జరుగుతున్న అంతిమ పోరాటం. అహమ్మదాబాద్, వార్ధాలలో కాంగ్రెసు తీర్మానాలు, కార్యక్రమం అంతా స్వాతంత్ర్యం వైపే పురోగమిస్తున్నది. మహాత్ముని పిలుపు మేరకు దేశప్రజ లందరూ ఒక్కత్రాటిమీద నిలిచి ప్రతిస్పందిస్తారనటంలో నాకు ఎలాటి సందేహం లేదు'' అన్నారు.

1942 ఆగస్టు 8 వేకువనే గాంధీ, ఆజాద్, నెహ్రూ మొదలగు నాయకులు అరెస్టు కాగా, బొంబాయి నుండి మద్రాసు తిరిగి వెళ్తున్న ప్రకాశం గారిని కడప రైలు స్టేషనులో ఆగస్టు 12 న అరెస్టు చేశారు.

వెల్లూరు, అమరావతి జైళ్ళల్లో మూడు సంవత్సరాలు మ్రగ్గి, యుద్ధా నతతరం మిగతా నాయకులతోపాటు విడుదలయినారు ప్రకాశం.

# క్విట్ ఇండియా ఉద్యమం

1941 వ్యక్తి సత్యాగ్రహం సందర్భంగానూ, 1942 క్విట్ఇండియా ఉద్యమ సందర్భంగానూ వేలూరు, తిరుచినాపల్లి, అమరావతి జైళ్లలో అనేక కష్టాలు భరించారు ప్రకాశం.

1945 లో జైలునుండి విడుదలయిన పిమ్మట ఆంధ్రదేశమంతటా పర్యటించి ప్రజల జేజేలందుకున్నారు. ఆయన దారిద్ర్యాన్ని కావాలని కోరుకున్నందున స్వంత ఉపయోగ నిమిత్తం చాలామంది నిధిని సమర్పించుకున్నారు. ఇది గిట్టని వారు గాంధీజీకి చాడీలు చెప్పారు. వీరిలో కళా వెంకట్రావు ముఖ్యుడు. ప్రకాశం గారికి జీవనం ఎలా గడుస్తుందని గాంధీజీ ప్రశ్నిస్తే ప్రజల నిధి నుండి అని కళా వెంకట్రావు బదులు చెప్పాడు. గాంధీజీ ప్రకాశంగారిని మందలిస్తూ- ప్రజల సొమ్ముపై ఆధారపడి మనుగడసాగించే వారికి శాసనసభ్యులుగా వుండడంగానీ, నాయకత్వం వహించడంగాని తగదని వ్రాశారు. ప్రకాశం దానికి తగిన రీతిని గాంధీజీకి వ్రాస్తూ తాను రోజూ వెయ్యి రూపాయిలు న్యాయవాదిగా ఆర్జించే దినాలలో సైతము దానిని ప్రజల సొమ్ముని భావించేవాడినని తెలిపారు.

ప్రకాశంగారు ఇంకా ఇలా అన్నారు: ''మానవుల, పితరుల, ఋషుల, దేవతల పట్ల నా విధులను నిర్వర్తిస్తూవస్తున్నాను. నా దేశంతో నేను ఏకీవృతమైనట్లుగా భావిస్తున్నాను - నాకు డబ్బుతో నిమిత్తంలేదు. నేను డబ్బు సంపాదించను, డబ్బు కూడబెట్టను. నా ఖర్చులుపోను, మిగిలిననా ధనం నా తర్వాత సరియైన విధంగా దేశానికే చెందుతుంది.''

ప్రకాశం జవాబు గాంధీజీ అసంతృప్తిని కొంత ఇనుమడింపజేసింది.

ప్రకాశంగారి సన్నిహిత అనుచరుడు నడింపల్లి నరసింహారావుగారు తమ ఆత్మకథలో ఈ సందర్భాన్ని ఇలా వివరించారు:

"ఆంధ్రకేసరి జైలులోనున్నారు. స్వరాజ్య పత్రికకు చేసిన బాకీలు డి కీలైనవి అప్పులున్నచో ముఖ్యమంత్రిగా నుండుటకు పనికిరాడను సమస్య లేవదీశారు. కొందరు మహాత్మునికి కొండెములు చెప్పుట మొదలు పెట్టారు అయన అనుచరులు నాబోటివారు చందాలు వసూలు చేసి అప్పులు తీర్చారు. 'కాంగ్రెసు పేర ఈ నిధులు వసూలు చేశారు, ఇది అక్రమ'మని కూడా మహాత్మునకు చెప్పిరి, మహాత్మునకు ఆంధ్రకేసరినిచూస్తే కొంత జంకు. వారు ముఖ్యమంత్రిగా నుండుట అంత యిష్టములేదు. ఆంధ్రకేసరి సర్వ స్వతంత్రుడు. ఆయన జంకులేని వ్యక్తి. ఎవరిని పాటించువాడుకాడు.

" 'మీకు తాతాబిర్లాలు వున్నారు. సాక్షి పరులున్నారు. ఈ నిధి నాకొరకు గ్రహించినదే కాని కాంగ్రెసు పనుల నిమిత్తము కాదు. మహాత్ముని పేరు మీద నిధులెట్లు వసూలగునో అట్లే తన పేర'యని జవాబుచెప్పి నా వద్దకు వచ్చి యీ యుదంతము చెప్పిరి. 'అంతనిధి ఆంధ్రకేసరికి నిచ్చినదే! కాంగ్రెసు పేరుచెప్పిన దమ్మిడీ పుట్టదు. మీ కాక్షేపణ యుండిన ఎవరిచ్చిన విరాళములు వారికిచ్చి వేయబడు'నని మహాత్మునకు రిజిష్టరు ఉత్తరము వ్రాసితిని. అంతట గుంటూరు బారిష్టరు (నడింపల్లి నరసింహారావు) వ్రాశాడని చిరునవ్వు నవ్వి ఆ నేరారోపణ భూస్థాపితము చేసెను ''

కాంగ్రెస్ అధిష్ఠానవర్గం మరియు గాంధీజీ రాజాజీని మద్రాసు ముఖ్య మంత్రిగా ఎంపిక చేయాలని పలువిధాల ప్రయత్నించినా ప్రకాశంగారే ఎన్నికైనారు.

# చారిత్రాత్మక సంఘటన

1946 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా కావడం ఒక విచిత్ర కథనం. యుద్ధానంతరం యెన్నికలు జరిగి తిరిగి కాంగ్రెస్ ప్రభుత్వం యేర్పాటు చేసే పరిస్థితి ఏర్పడింది. అంతకు కొన్ని నెలల ముందే క్విట్ ఇండియా ఉద్యమంలో జైలుకు వెళ్ళిన నాయకులందరితో పాటు ప్రకాశం విడుదలైనాడు. ఇక కాంగ్రెసుపార్టీ నాయకుడు - ముఖ్యమంత్రి యెవరు అనే

ప్రశ్న ఉదయించేసరికి రాజకీయాలలో ఉద్రిక్తత అసూయాద్వేషాలు పోటా పోటీలు యెక్కువైనాయి. గాంధీగారికి. కాంగ్రెస్ అధిష్టాన వర్గానికి రాజాజీని ముఖ్యమంత్రిని చేయాలని, ప్రకాశం ఉండరాదని బహిరంగంగానే వాదప్రతి వాదాలు పత్రికలకెక్కినాయి

మద్రాసు దక్షిణ భారత హిందీ ప్రచారసభ రజితోత్సవానికి ప్రధాన అతిథిగా 1946 జనవరి ఆఖరులో చెన్నపట్నం వచ్చిన గాంధీగారు తమ సన్నిహితుడు, సంబంధి అయిన రాజగోపాలాచారికి అనుకూలంగా బహిరంగంగానే ఉపన్యాసాలిచ్చాడు ఆ ప్రచారంలో భాగంగా ఒకానొక సభలో రాజాజీకి వ్యతిరేకంగా ఒక ముఠా (Clique) బయలుదేరినదని చురుకుగానే మాట్లాడారు. మరి రాజకీయ వైపరీత్యాల వల్ల తాననుకున్నట్లు జరుగలేదు. మద్రాసు కార్యక్రమాలు ముగించుకుని తిరిగివెళుతూ విజయవాడలో కొంతసేపు 5-2-46న ఆగారు గాంధీజీ. ఆనాడు సోమవారం అయిందేమో మౌనవ్రతంలో ఉన్నారు. అప్పుడు విజయవాడ రైల్వేస్టేషనులో లక్షలాది ప్రజలు ఆయన దర్శనార్థం గుమికూడగా యెర్నేని సుబ్రహ్మణ్యం అను ఒక గాంధేయవాది హిందీలో వ్రాతపూర్వకముగా గాంధీగారిని ఒక ప్రశ్న వేశాడు: "మీరు మద్రాసుకు రాజాజీని ప్రీమియర్ చేయుటకే వచ్చినారని ఆంధ్రదేశమంతా అనుకుంటున్నారు. దీనికి మీరు యేమి జవాబు చెబుతారు?'' దీనికి బదులుగా గాంధీగారు ''రాజాజీని ముఖ్యమంత్రిని చేయుటకు నేను ఢిల్లీనుంచి రావలయునా? ఢిల్లీనుంచే చేయలేనా? ఏది ఏమైనా, ఆ ముఖ్యమంత్రి పదవికి రాజాజీయే సర్వోత్తమయినవాడు అని నా ఉద్దేశము" అని వ్రాశారు ఇది గాంధీజీ తమ 'హరిజన్'' లో ప్రచురించారు కూడా.

ఇక కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ కలుసుకోవాలి, తమ నాయకుణ్ణి యెన్నుకోవాలి. ఆ సమయంలో కాంగ్రెస్ అధిష్టాన వర్గం అప్పటి అధ్యక్షుడు అబుల్ కలామ్ అజాద్; పటేల్ వంటి పెద్దలు మరి గాంధీజీయే ఆదేశాలు సలహాలు పరోక్షమైన బెదిరింపులు అన్నీ చేశారు. వి వి గిరిగారి అధ్యక్షతన సమావేశమైన లెజిస్లేచర్ పార్టీ సమావేశాలు ఒకటికి నాలుగుసార్లు జరుగవలసి వచ్చింది. చివరకు పోటీలో ప్రకాశంగారే గెలిచి విజయభేరి మ్రోగించారు. ఆ రోజులలో గాంధీగారి ఆగ్రహానికి గురిఅయి ఆయనను యెదిరించి నిలవడమనేది అసాధ్యంగా భావింపబడిన స్థితిగతులవి. నిష్కాపట్యము, నిర్భీతి, నిష్కళంక ప్ర[illegible]

ముప్పిరిగొని ప్రకాశంగారు ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి కావడానికి దోహద పడినవి.'అదీ ప్రకాశం అంటే'అని ఆంధ్రజాతి అంతా ఆనందోత్సాహాలతో పొంగిపోయిన తరుణమది.

# ప్రజలు మెచ్చిన నిర్ణయాలు

**1946** ఏప్రిల్ 30 న ప్రకాశం మద్రాసు ముఖ్యమంత్రి పదవి చేపట్టారు. ఆయన మంత్రివర్గంలోగల పదకొండుమందిలో 9 మంది న్యాయవాదులు.

మంత్రివర్గం ముందుగా జైళ్ళలో నిర్బంధింపబడిన రాజకీయ ఖైదీలను విడుదల చేసింది. గ్రామస్థుల నుండి వసూలయిన ఉమ్మడిపన్ను తిరిగి ప్రజలకు ఇస్తూ ఉత్తర్వు చేసింది 1942 ఉద్యమంలో నష్టపోయిన టీచర్లకు తిరిగి ఉద్యోగాలిస్తూ ఉత్తర్వు చేసింది.

మునిసిపల్ భవనాలమీద, జిల్లా బోర్డు భవనాల మీద కాంగ్రెసు పతాకం ఎగుర వేయరాదనే నిషేధం రద్దుచేసింది. హరిజన దేవాలయ ప్రవేశాన్ని నిరాకరించే ఉత్తర్వును రద్దుచేస్తూ బిల్లును ఆమోదించింది. సేలం ఉత్తర ఆర్కాటు చిత్తూరు కడప జిల్లాలలో మద్యనిషేధం అమలుపరుస్తూ ఉత్తర్వులు వెలువరించింది. ముఖ్యమంత్రిగా ప్రకాశం పదవి స్వీకరించిన పదిహేను దినాలకే అనగా 1946 ఏప్రెల్ 15 న ఆహార ధాన్యాల కొనుగోలు పంపిణీ పథకం సిద్ధం చేసింది. రాష్ట్రం తిండిగింజల విషయంలో స్వయం సమృద్ధం కావాలని ప్రకాశం గారి పట్టుదల.

ప్రకాశంగారు ముఖ్యమంత్రి కాగానే ఇరువురు కార్మికులు మద్రాసులో ''మన ప్రకాశం (నమ్మప్రకాశం) వచ్చాడు. మనకు తిండికి కరువులేదురా అని అరవంలో మాట్లాడుకున్నారని ప్రముఖ గాంధేయవాది కీ.శే ఓరుగంటి వెంకట సుబ్బయ్య తెలిపారు.

గ్రామ స్వరాజ్యం కావాలని ప్రకాశం కలలు కనేవారు. గ్రామీణ విశ్వ విద్యాలయం స్థాపించి బాబూ రాజేంద్రప్రసాద్‌ను కులపతిగా నియమించి, తాను ఉపకులపతిగా నున్నారు. ముఖ్యమంత్రి కాగానే గోపన్న పాలెంలో గ్రామ సేవకుల శిక్షణా శిబిరం నెలకొలిపారు.

# నడ్డిమీద రక్తంతోవున్న అర్హతలు

ఫిర్కా డెవలెప్‌మెంట్ స్కీమును ప్రవేశపెట్టిన ప్రకాశం అందులో పలువురు స్వాతంత్ర్య సమరయోధులకు ఉద్యోగాలిచ్చారు. దీనిపై శాసన సభలో విమర్శ రాగా చర్చ ఇలా సాగింది:

ఒక యం యల్.ఏ. : బొత్తిగా అర్హతలు లేని ఆ పెద్ద మనిషిని ఎవరు బి.డి.ఓ. గా నియమించారు?

ప్రకాశం : నేనే !

యం.యల్.ఏ. : ఆయన మెట్రిక్యులేషన్ కూడా కాలేదు. వయస్సు ఉద్యోగానికి మించిపోయింది.

ప్రకాశం : ఆయన అర్హతలేవో ఆయన నడ్డిమీద రక్తంతో రాసివుంటాయి. నీలాంటివారు యం.యల్ ఏలు గా కావడానికి ఆయన ఎనిమిదేళ్లు జైలులో వున్నాడు. పదే పదే లాఠీ దెబ్బలు తిన్నాడు. అర్థమైనదా? ఇక కూర్చో.

# కార్మికుల మిత్రుడు

ప్రకాశం ముఖ్యమంత్రిగానున్న దినాలలో రైల్వే కార్మికుల సమ్మె జరిగింది పలుచోట్ల హింసాత్మక సంఘటనల జరిగాయి. దీని నివారణకు కమిటీ వేయాలని రాజాజీ గవర్నరుకు సూచించారు ప్రకాశం దానిని తిరస్కరిస్తూ శాంతిభద్రతల పరిరక్షణ తన స్వంత బాధ్యత అంటూ కార్మికనాయకుడు వి.వి. గిరి తోడ్పాటుతో సమస్య పరిష్కరించాడు

బకింగ్‌హామ్ కర్ణాటక మిల్లు కార్మికులు ఒకసారి పెద్దయెత్తున సమ్మె చేశారు. నాయకత్వం వహించిన అంథోనీని అరెస్టు చేశారు. ఆ నాయకుణ్ని పిలిపించుకొని యాజమాన్యంతో మాట్లాడి సమ్మె సామరస్యంగా పరిష్కరించాడు ప్రకాశం అరెస్టయిన నాయకుడు ముఖ్యమంత్రి సమక్షంలోనికి తీసికొనిరావడం మునుపెన్నడూ జరుగలేదని పలువురు ప్రశంసించారు.

# అది ప్రకాశానికే చెల్లు: గాంధీ ప్రశంస

మద్రాసు రాష్ట్ర శాసనసభ నుండి కొందరిని కేంద్ర శాసనసభకు ఎన్నుకో వలసి వుండెను. మేధావులయిన అల్లాడి కృష్ణస్వామి సర్వేపల్లి రాధాకృష్ణలను ఎన్నుకోవడంలో ఏ వర్గానికి అభిప్రాయభేదం లేదు.

ఉదారబుద్ధితో కాంగ్రెసులో తనకు ప్రతికూలంగా వుండేవారిని సైతం ప్రకాశం ఎంపిక చేసి కేంద్రానికి పంపారు వారు ఇదే అదనుగా భావించి ప్రకాశం మంత్రివర్గంపై కొండెములు చెప్పడానికి తమ ఢిల్లీ యాత్రలను వినియోగించు కున్నారు.

నిజానికి ప్రకాశమే గాంధీజీ కార్యక్రమాలను తు.చ. తప్పక అమలు పరిచారు గ్రామీణ అభివృద్ధి పథకాలు, ఫిర్కా డెవలప్‌మెంటు స్కీము. ఉత్పత్తి మరియు వినియోగదారుల సహకార సంఘాలు, జాతి విస్తరణ పథకాలు వివరిం చేందుకు ప్రకాశం ప్రత్యేక దూతను గాంధీజీ వద్దకు పంపారు.

ప్రకాశంగారి కార్యక్రమాలన్నిటినీ హర్షిస్తూ ప్రత్యేకించి ఖాదీ స్కీము - ఖాదీ ఉత్పత్తి కేంద్రాలలో మిల్లు గుడ్డ నిషేధింపబడటం - తన కెంతో నచ్చిందని ప్రకాశం ప్రతినిధితో గాంధీ చెప్పారు ప్రకాశం పథకం విజయమైతే దేశమంతటికీ అది ఆదర్శం కాగలదని ఆయన ప్రకటించారు

ప్రధానిగా పదవి చేపట్టనున్న జవాహరులాల్‌గారికి ఈ పథకం సిఫార్సు చేయగూడదా అని ప్రకాశం ప్రతినిధి గాంధీజీని ప్రశ్నించారు.

అందుకు గాంధీజీ చిరునవ్వుతో "భలే వాడివయ్యా! నీవు ఒట్టి అమాయ కుడిలాగున్నావు అది ప్రకాశంగారికే చెల్లింది" అన్నారు. ప్రకాశంను ప్రశంసిస్తూ గాంధీ 'హరిజన్' పత్రికలో వ్యాసం ప్రకటించనుండగా దా ని కొందరు అడ్డు కొని నిలుపు చేశారని అనుకొన్నారు.

# కృషి ప్రకాశందే – పేరు రాజాజీది

మద్రాసులోని సెంట్ జార్జికోటలో గవర్నరు బిల్డింగు 110 ఎకరాల విశాల మైదానంలో వుంటూ వచ్చింది. యుద్ధం ముగిసిన తరువాత గవర్నరు అక్కడికి 8 మైళ్ళలో వుండే 'గిండీ'లో వుంటూ వచ్చారు. యుద్ధ కాలంలో గవర్నరు బంగళాని ఆనుకొని చిన్న భవంతులు నిర్మించారు. రాజాజీ ప్రధానిగా వున్న కాలం (1937)లో వీటిని ప్రభుత్వ ఉపయోగార్థమివ్వమనికోరారు. అప్పటి గవర్నరు అందుకు అంగీకరించలేదు.

ప్రకాశం ముఖ్యమంత్రి (1946) కాగానే గవర్నరు ఆర్చిబాల్డు నైతో చర్చించారు. గవర్నరుకు ఉపయోగం లేకుండా వున్న "బ్యాంకెట్ హాల్" శాసన సభ్యుల హాస్టలుకై ఇవ్వమని కోరారు. గవర్నరు లేవనెత్తిన సందేహాలన్నీ ప్రకాశం సమాధానాలిచ్చి ఆయనను ఒప్పించారు. ఇంతలో ప్రకాశం ప్రభుత్వం పడిపోయింది. ఆయన కృషిని విస్మరించి దానికి రాజాజీ హాలుగా నామకరణం చేయడం జరిగింది. సంఘటనల ప్రభావం అది.

# ప్రతిపక్షనాయకునితో ముఖ్యమంత్రి

ఒకనాటి వేకువజామున వానియంబాడినుండి ప్రతిపక్ష నాయకుడు ఇస్మాయిల్ సాహెబ్ ముఖ్యమంత్రి ప్రకాశంగారిని నిద్రలేపాడు.

తమ పట్టణంలో హిందూ-ముస్లిం తగాదా దావానలంగా వ్యాపించిందనీ వెంటనే పోలీసు ఉన్నతోద్యోగులను పంపమని కోరాడు.

ప్రకాశం సమాధానంగా 'నేను ముఖ్యమంత్రిని, మీరు ప్రతిపక్షనాయకులు. ఈ పని మనమే సర్దుబాటు చేద్దాము. పోలీసువారేమి చేయగలరు?' అనేసరికి ఇస్మాయిల్ నివ్వెరపోయాడు. చివరకు పంతులుగారూ సాహెబుగార్లే వానియంబాడిలో శాంతి పరిస్థితులు నెలకొనేటట్లు చేశారు.

# అవిశ్వాసము

ప్రకాశంగారి పలు పథకాలు సామాన్య ప్రజలకు మేలు చేకూర్చేవి. కానీ పలుకుబడిగల వ్యక్తుల స్వార్థ ప్రయోజనాలకు భంగం కలిగించేరీతిలో వుంటూ వచ్చినవి. ప్రకాశంకు వ్యతిరేక వర్గాలన్నీ ఏకమై 1947 మార్చిలో అవిశ్వాస తీర్మానం తెచ్చారు. కాంగ్రెసుపార్టీ అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టిన సమావేశంలో ప్రకాశం ఇలా ప్రసంగించారు:

"నేను ఒక బీద కుటుంబంలో జన్మించాను. నన్ను పెద్దచేసి శిక్షణ నిచ్చిన వారూ బీదవారే! నాకు స్వతహాగా ఎక్కువ మాట్లాడే అలవాటు లేదు. అయినప్పటికీ నా విద్యార్థి దశలోగానీ మునిసిపల్ రాజకీయ జీవితంలోగానీ తరువాత ప్రజా జీవితంలోగాని నా స్వభావంవల్ల ఏ మిత్రుడు అనాదరణ భావం కల్గివుండ లేదు.''

ఆయన ఇంకా ఇలా అన్నారు:

''పదకొండు నెలలు ముఖ్యమంత్రిగా వున్న నేను నేటినుండి సాధారణ సభ్యునిగా ఈ సభలో కూర్చొంటాను. ఫలితంతో నిమిత్తం లేకుండా నా వైపు దృఢంగా నిలిచిన 73 సాహస వీరులతోపాటు నన్ను ఎదిరించిన 116 మంది మిత్రులను కూడా నేను అభినందిస్తూన్నాను. వారంతా త్యాగధనులు. శాసన సభలో గాక బయట కూడా వారితో నేను ఇరవై అరు సంవత్సరాలుగా పని చేస్తూన్నాను. అందరికీ వందనాలు అర్పిస్తూ విరమిస్తూన్నాను''.

ప్రకాశంగారి ప్రసంగం తుది పలుకులు అందరి నయనాలు చెమ్మగిల చేశాయి.

# రాజ్యాంగ పరిషత్తులో ప్రకాశం

1948-49 లలో భారత రాజ్యాంగ పరిషత్‌లో సభ్యులుగా రాజ్యాంగ చట్టంలో పంచాయతీ వ్యవస్థకు స్థానం కల్పించటానికి ప్రకాశంగారు ఎంతో కృషి చేశారు. దీని పూర్వాపరాలు చూద్దాం:

స్వతంత్ర భారత్‌కు అనువైన రాజ్యాంగ నిర్మాణానికి ఏర్పాటైన డాక్టరు అంబేడ్కరు సంఘం సుదీర్ఘ చర్చల పిమ్మట ఒక ముసాయిదా ప్రకటించింది. విస్తృతంగా ప్రచారం పొందిన ఈ ముసాయిదాలో రాష్ట్రాలు, కేంద్రం-వీటిని గూర్చి ప్రముఖంగా ప్రస్తావన వున్నది. కానీ, గ్రామీణ వ్యవస్థకు కీలకమైన పంచాయతీల ప్రస్తావన ఎక్కడా కానరాలేదు. స్వాతంత్ర్య పోరాట దినాలలో ప్రత్యేకించి గాంధీ శకంలో గ్రామాలే భారతదేశ ఆత్మ అని నమ్మిన వారికి ఇది మింగుడు పడలేదు. వార్ధా కాలేజి ప్రిన్సిపాల్‌గా వున్న శ్రీమన్నారాయణ గాంధీజీ దృష్టికి ఈ అంశాల్ని తీసికొని వెళ్ళారు. గాంధీజీ వీరి లేఖపై స్పందిస్తూ 1947 డిశంబరు 12 నాటి హరిజన పత్రికలో ఇలా వ్రాశారు:

"ఇప్పుడు తయారగుచున్న మన రాజ్యాంగ చట్టంలో గ్రామ పంచాయతీల వికేంద్రీకరణ గూర్చి ప్రస్తావనలేదని ప్రిన్సిపాల్ అగ్రవాల్ చెబుతున్నారు. ఇది నిజంగానే పెద్దలోపమని చెప్పాలి. మన స్వాతంత్ర్యం ప్రజల వాణిని ప్రతిబింబించాలంటే దీనిని వెంటనే మార్చాలి."

1948 నవంబరు 4 న రాజ్యాంగ పరిషత్తులో రాజ్యాంగ చట్టాన్ని ప్రవేశ పెడుతూ డా॥ అంబేడ్కరు "గ్రామాలలో ఏమున్నది గనుక, సంకుచితత్వం మూతా తగాదాలు, అవిద్య, కులకక్షలు తప్ప'' అనేశాడు. దానితో స్వాతంత్ర్య ఉద్యమంలో గాంధీజీ గ్రామ స్వరాజ్య సిద్ధాంతాన్ని నమ్మి పాల్గొన్న వారంతా ఒక్క ఉదుటన లేచారు. వారిలో ఆచార్య రంగా, కె. సంతానం, అనంతశయనం అయ్యంగార్, ఆంధ్రకేసరి ప్రకాశం ప్రథములుగా నున్నారు.

1948 నవంబరు 22 న రాజ్యాంగ పరిషత్‌లో ప్రకాశం ప్రసంగం ఇలా సాగింది: "ఈ ముసాయిదాలో గ్రామాన్ని రాజ్యాంగ చట్టంలో నిజమైన భూమికగా తీసికొనక పోవడం వలన చాల క్లిష్ట పరిస్థితి ఏర్పడినది. ఈ ప్రకటించబడిన ప్రతిపాదనలో రాజ్యాంగం పైనుండి క్రిందికి నిర్మించబడినది. ఇక మేము - డాక్టర్ రాజేంద్రప్రసాదుతో సహా - చెప్తున్నది. ఆ రాజ్యాంగం క్రింది నుండి (గ్రామ స్థాయినుండి) గ్రామం పునాదిగా ఆరంభం కావాలని. ఇదే మహాత్మాగాంధీ చెప్పుచూ వచ్చినదీ, ముప్పయి ఏండ్లుగా కృషి చేస్తూ వచ్చినదీను.''

PMP-5

ఈ నేపథ్యంలో కె. సంతానం ముసాయిదాలో **31-A** అధికరణను ప్రతిపాదించారు: "ప్రభుత్వం గ్రామ పంచాయతీలను ఏర్పాటుచేసి వాటికి కావలసిన వనర్లను సమకూర్చి అవి స్వయం ప్రతిపత్తిగల సంస్థలుగా పెంపొందేటందుకు కృషిచేస్తుంది.'' దీనిపై ఒక సంవత్సరంపాటు తర్జనభర్జనలు జరిగాయి. ఎట్ట కేలకు 1949 నవంబరులో డాక్టరు అంబేద్కరు ప్రభృతులు సంతానంగారి ప్రతిపాదనను రాజ్యాంగంలో ఒక ఆదేశిక సూత్రం (ఆర్టికలు 40) గా చేర్చారు ప్రకాశం తమ వాదనలు అంగీకరింపబడినందులకు మిక్కిలి సంత సించారు.

తాము 1937 లో చెన్న రాజధానిలో రివిన్యూ మంత్రిగా పంచాయతీల హక్కులు వనర్లపై బిల్లు ఒకటి ప్రకాశంగారు ప్రవేశపెట్టారు.

మరలా 1946 లో చెన్నరాష్ట్ర ముఖ్యమంత్రిగా ప్రవేశపెట్టిన ఫిర్కా డెవలెప్‌మెంటు స్కీము, కొనుగోలుదారుల వినిమయవాదుల సహకార సంఘాలు వారికి స్వరాజ్యం పట్ల గల మక్కువ తెలియజేస్తున్నవి.

దీని నంతటిని దృష్టిలో నుంచుకొని కీ.శే. టి. అంజయ్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రిగానున్న దినాలలో ప్రకాశం జన్మదినమైన అగస్టు 23 గ్రామ స్వరాజ్య దినంగా ప్రకటించారు.

ఈనాడు రాజ్యాంగ 73 వ సవరణ ద్వారా పంచాయతీరాజ్ వ్యవస్థ స్వరూప స్వభావములను మార్పు తలపెట్టినారంటే దానికి గాంధీజీ, ప్రకాశం లాంటి జాతీయనేతల అవిరళకృషి, దూరదృష్టియే కారణమనక తప్పదు.

# ప్రజానాయకుడు

మద్రాసు ముఖ్యమంత్రిగా వైదొలిగిన ప్రకాశం ప్రజలకు జరిగిన చరిత్ర వివరిస్తూ ఆంధ్రదేశమంతటా పర్యటించారు.

ప్రజల హృదయాలలో ఆయన స్థానం సుస్థిరమైనదని గ్రహించడానికి ఎంతో కాలం పట్టలేదు.

ప్రకాశంగారిపై అవిశ్వాసం నెగ్గడంలో భాగస్థులైన ఆంధ్ర నాయకులను (పేర్లు అందరికీ తెలిసినవే) ప్రజలు తీవ్రంగా నిరసించారు.

ప్రకాశం కాంస్యవిగ్రహం ఆంధ్రదేశపు నడిబొడ్డున వున్న విజయవాడలో నెలకొల్పాలని నిర్ణయించారు. ప్రజల నుండి చక్కని స్పందన లభించింది. తెన్నేటి విశ్వనాథం, టి.వి.యస్. చలపతిరావుగారలు ఈ సత్కార్యానికి పూనుకొన్న సహృదయులు. 25 వేల రూపాయలు అచిరకాలంలోనే వసూలయినవి.

1951 జనవరి 23 న 82 జతల ఎడ్లను పూన్చిన రథముపై ప్రకాశంగారి చిత్రపటాన్ని ఊరేగిస్తూ లక్షలాది జనావళి ఆనందోత్సాహాలతో ప్రకాశంగారికి జై అని నినాదాలు చేస్తుండగా రఫీ అహ్మద్ కిద్వాయ్ ఆంధ్రకేసరి విగ్రహాన్ని ఆవిష్కరించారు.

ప్రకాశం ఆంధ్రదేశానికే కాదు, జాతి యావత్తు గర్వించగల జాతీయ నాయకుడని ఆ సభలో పాల్గొన్న పి. సి. ఘోష్ ప్రశంసించారు.

రాయలసీమ వైతాళికుడు కి.శే. పప్పూరు రామాచార్యులు తమ వార పత్రిక ''శ్రీసాధన''లో సంపాదకీయం వ్రాస్తూ ''ప్రజలు ఎవరిని అభిశంసించవలెనో, ఎవరిని ప్రశంసించవలెనో చక్కగా గుర్తించా''రని వ్రాశారు.

# గడగడలాడిన గవర్నరు

మారిన పరిస్థితుల వల్ల కాంగ్రెసు నుండి ప్రకాశం బయటకు రావలసి వచ్చింది. ఆయనతోపాటు మరికొందరు ప్రముఖులు జె. బి. కృపలానీ, ఆచార్య రంగా, పి. సి. ఘోష్‌లు రాజీనామాలు చేశారు.

1951 జూన్‌లో వీరంతా కలసి కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ స్థాపించారు.

1952 ఎన్నికలలో మద్రాసు రాష్ట్రంలో ఈ పార్టీ కాంగ్రెసుతో తలపడింది. ప్రకాశం ఆంధ్రదేశమంతటా తిరిగి కాంగ్రెసును ఓడించాలని తీవ్ర

ప్రచారం చేశారు. కోస్తా ఆంధ్ర జిల్లాలో కె. యం. పి. ఎక్కువ స్థానాలు సంపాదించింది. వీరు గెలువని ప్రాంతాలలో కమ్యూనిస్టులో స్వతంత్రులో నెగ్గారు రాయలసీమలో కొద్ది సంఖ్యలో కాంగ్రెసుకు స్థానాలు లభించాయి. మద్రాసు శాసనసభలో కాంగ్రెసు మెజారిటీ కోల్పోయింది కృషికార్‌లోక్ పార్టీ, ముస్లింలీగు కాంగ్రెసుకు తోడ్పడినవి. అయినా వీరి సంఖ్య 150 మించలేదు.

ప్రతిపక్షంలో 164 మంది వున్నారు. వీరంతా ఐక్యఫ్రంటుగా ఏర్పడి ప్రకాశంగారిని తమ నాయకుడుగా ఎన్నుకున్నారు.

అప్పుడు గవర్నరుగా వున్న శ్రీ ప్రకాశ న్యాయ పక్షపాతి అని పేరు గాంచినవాడు, ప్రకాశంగారి పట్ల గౌరవము కలిగినవాడు.

అయినా కౌన్సిల్‌కు నామినేట్ కాబడిన రాజాజీని ఆయన ముఖ్యమంత్రిగా నియమించారు.

ఇది ప్రకాశంగారి ఆగ్రహానికి కారణమైనది.

ఉభయ సభలను ఉద్దేశించి గవర్నరు శ్రీ ప్రకాశ్ ప్రసంగించడానికి లేచి నిలబడ్డారు. ప్రతిపక్ష నాయకుడు ప్రకాశం నిలబడి గంభీరస్వరంతో గవర్నర్‌ను ఇలా హెచ్చరించారు:

'మీరు మెజారిటీ వారిని కాదని రాజాజీని ముఖ్యమంత్రి చేశారు. మీరు చేసినంత మాత్రాన ఆయన ముఖ్యమంత్రి కాడు. మీ చర్య రాజ్యాంగ విరుద్ధం. మీరు సరిదిద్దేవరకూ మేము సభలోనికి రాదలచలేదు'' అంటూ సభనుండి బయటకు నడిచాడు. ఆయన అనుచరులు 164 మంది ఆయనను అనుసరించారు. గవర్నర్ దిక్కుతోచని వాడైనాడు. రెండు నిమిషాలలో ఆయన ప్రసంగము ముగించి వెడలిపోయినాడు.

ఈ విధంగా గవర్నర్‌ను ధిక్కరించడం చరిత్రలో ఇదే ప్రథమం.

తనకు అధర్మమని తోచినపుడు ఖండించడానికి ప్రకాశం ఏనాడూ జంకేవాడు కాడు.

# ఆంధ్రోద్యమంలో ప్రకాశం

1938 ఏప్రిల్‌లో దేశభక్త కొండ వెంకటప్పయ్య ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం మద్రాసు కేంద్రంగా ఏర్పాటు చేయాలనే తీర్మానం ప్రతిపాదించాడు. రెవిన్యూమంత్రిగానున్న ప్రకాశం దీనిని బలపరిచాడు. శాసన సభ ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానాన్ని గవర్నరు బలపరుస్తూ ఆంధ్ర తమిళ రాష్ట్రాలకు ఒకే రాజధాని (మద్రాసు). ఒకే గవర్నరు వుండనగునని సూచించారు.

కానీ బ్రిటిష్ ప్రభుత్వం దీనిని అంగీకరించలేదు. కారణం - మద్రాసు కేంద్రంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే మద్రాసులో రక్తపుచేరులు పారుతవని ఒక "దుష్ట మేధావి" (Evil genius) లండన్‌కు కబురంపడమే.

1941 డిశంబరు 6 న విశాఖపట్నం ఆంధ్ర మహాసభలో ప్రకాశంగారు ఈ విషయాన్ని బహిర్గతం చేశారు. ఆ 'దుష్టమేధావి' ఎవరన్నది పోల్చుకోవడానికి ప్రజలకంత కష్టమైనవని కాలేదు.

1941 డిసెంబరు 21న ఆంధ్ర మహాసభ ప్రకాశం పట్ల పూర్తి విశ్వాసం ప్రకటించింది.

రాజ్యాంగ సభలో కూడా ప్రకాశం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి మిక్కిలి కృషి చేశారు. కాని, అది ఫలించలేదు. 1949 లో ఏర్పాటైన జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయిపటేల్, పట్టాభిగార్లతో (జె.వి.పి.) కూడిన కమిటీ మద్రాసు నగరంపై ఆంధ్రులు తమ హక్కు వదులుకోవాలని సూచించింది. పార్టీషను కమిటీలో సభ్యుడుగా వున్న ప్రకాశం కమిటీతో విభేదిస్తూ నివేదిక సమర్పించారు.

మద్రాసు చారిత్రకంగా సాంస్కృతికంగా తెలుగు పట్టణమని, అది ఆంధ్ర రాష్ట్ర రాజధానిగా వుండాలని ప్రకాశం పట్టుదల. చెన్నపట్టణం తెలుగుపట్టణం అనే గ్రంథం కూడా ఆయన ప్రచురించారు. మద్రాసులోనే ఆయన 1937 లో గెలిచి, మరి 1952 ఎన్నికలలో ఓడిపోయారు. పొట్టి శ్రీరాములుగారు కూడా మద్రాసుపై ఆంధ్రులకు ప్రత్యేక హక్కులు కలవని భావించేవారు.

# రాయలసీమ కరవు

1952 లో రాయలసీమలో కరవు విలయతాండవం చేసింది. ఆనాటి మద్రాసు ముఖ్యమంత్రి కరవును గూర్చి తక్కువగా ప్రచారం చేయండని కలెక్టర్లకు సలహా యిచ్చాడట!

తాను ఏర్పాటు చేసిన సహాయ కమిటీలో ఆచార్య రంగా, ప్రకాశంగార్లను మాత్రమే నియమించాడు. పెక్కురు శాసన సభ్యులున్నప్పటికీ కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధులను ఒక్కరినీ సహాయ కమిటీలో సభ్యులుగా వేయలేదు.

కమ్యూనిస్టులకు ఇది ఆగ్రహానికి కారణమైనది. విజయవాడలో ఐక్య పక్ష సహాయ సమితిని ఏర్పాటు చేశారు. ఆంధ్రకేసరిని అధ్యక్షునిగా ఎన్నుకున్నారు.

కరవు నివారణకు నిధులు అధిక మొత్తాలలో వచ్చినవి. రష్యా, చైనా దేశాలనుండి నిధికి విరాళాలు వచ్చినవి. విదేశాలనుండి కరవు నిధులు సేకరించేందుకు కేంద్రం అనుమతి అవసరమన్నారు. ప్రకాశంగారు కలుగజేసికొనిన మీదట పరిస్థితి చక్కబడింది.

# శ్రీరాములుగారి ఆత్మబలిదానం

ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు, మద్రాసునగర భవిష్యత్తు-వీటినిగూర్చి ప్రజలలో స్పందన కలిగించే తలంపుతో గాంధేయవాది పొట్టి శ్రీరాములు ఆమరణ నిరాహార దీక్షకు పూనుకొన్నారు.

మద్రాసులోని బులుసు సాంబమూర్తిగారి నివాసంలో 1952 అక్టోబరు 19 న ప్రారంభమైన దీక్ష 58 రోజుల తర్వాత డిసెంబరు 15 న ఆయన ఆత్మబలిదానంతో ముగిసింది.



ఆంధ్రరాష్ట్ర అవతరణకు కారకుడు
పొట్టి శ్రీరాములు

నాడు ఆంధ్రదేశమంతా అట్టుడికిపోయింది. శ్రీరాములుగారి భౌతిక కాయాన్ని ఎండ్లబండిమీద మైలాపూరునుండి మౌంట్ రోడ్డుపై జార్జిటౌన్ మీదుగా చాకలిపేట శ్మశానవాటికి చేర్చారు. ఆంధ్రకేసరి ప్రకాశం, మహర్షి సాంబమూర్తి వాహనంమీద భౌతికకాయానికి ఇరువైపులా కూర్చున్నారు. శ్మశానవాటికలోనే సంతాప సభ జరిగింది. ప్రకాశంగారు శ్రీరాములు గారిని గాంధీజీని మించిన త్యాగి అని ప్రశంసించారు. 'శ్రీరాములు చనిపోలేదు ఆయన అమరజీవి. ఆయన మన అందరిలో జీవించి వున్నాడు. అందుచేత మనం ఆయన అడుగు జాడల్లో నడవాలి' అని కర్తవ్యం గుర్తు చేశాడు ఆంధ్రకేసరి.

పెల్లుబికిన ప్రజావెల్లువ ఆంధ్రదేశంలో పలుచోట్ల విధ్వంసకాండకు దారి తీసింది. శాసనసభ్యులు ప్రభుత్వ వైఖరికి నిరసనగా రాజీనామాలు ప్రకటించారు. 1952 డిశంబరు 19న వివాదంలేని ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు కాగలదని ప్రధాని నెహ్రూ ప్రకటించారు.

# ఆంధ్ర రాజధాని ఎక్కడ?

ఆంధ్ర రాష్ట్ర ప్రకటనతో ఆంధ్రులకు మద్రాసుపై హక్కు పదలుకొనినట్లయినది. తమ ప్రాంతంలో రాజధాని నిర్ణయించుకోవాల్సి వచ్చింది.

1973లో సర్కారు, రాయలసీమ ప్రతినిధుల మధ్య కుదిరిన ''శ్రీబాగ్'' ఒడంబడిక ననుసరించి తమ ప్రాంతానికే రాజధాని కావాలని రాయలసీమ శాసన సభ్యులు వాదించారు.

ఆంధ్రకేసరి మద్రాసులోని తమ నివాసంలో వివిధ పార్టీలకు చెందిన శాసన సభ్యులతో సంప్రదించారు.

కమ్యూనిస్టు శాసన సభ్యులు విజయవాడ రాజధాని కావలెనని కోరారు. తెన్నేటి విశ్వనాథం ప్రభృతులు విశాఖపట్నం కావలెననీ, గౌతు లచ్చన వర్గం తిరుపతి కేంద్రంగా వుండాలని వాదించారు. కడప కోటిరెడ్డి కడప రాజధానిగా సూచించారు.

ఏకాభిప్రాయం సాధించలేని సభ్యులు చివరిమాటగా ప్రకాశంగారి నిర్ణయానికి వదలినారు.

ప్రకాశం సాయంత్రం తన నిర్ణయం తెలుపగలమనినారు. అందరు శాసనసభ్యులు తిరిగి సమావేశమైన పిమ్మట గౌతు లచ్చన్నను పిలిచి నూతన రాష్ట్రానికి తాత్కాలిక రాజధాని ''కర్నూలు''గా ఎంపిక చేశానని ప్రకటించారు.

'మనం త్వరలో హైదరాబాదు కేంద్రంగా విశాలాంధ్ర సాధిస్తాము. అప్పటి వరకు కర్నూలు తాత్కాలిక రాజధానిగా వుండగలదు. కర్నూలు హైదరాబాదుకు చేరువలో వుందన్నారు ప్రకాశం.

# ఆంధ్ర రాష్ట్ర తొలి ముఖ్యమంత్రి

నూతన రాష్ట్రానికి ముఖ్యమంత్రి ఎవరు? ఈ ప్రశ్నకు జవాబు చాలా తేలిక. ఆంధ్ర ప్రజల హృదయాలలో సుస్థిరస్థానం సంపాదించిన ప్రకాశంగారే ఇందుకు తగినవారు. నెహ్రూ పండితుని మొదలు సామాన్యునివరకూ తెలిసినదే! ఆయన అప్పుడు కాంగ్రెసులో లేడు; ప్రజాపార్టీ నాయకుడు విశాలదృక్పథంతో ఆయనను పార్టీ బంధాలనుండి విముక్తి చేసింది.



80 వ ఏట ప్రకాశం

యువకుడు, కార్యదీక్షాపరుడు నీలం సంజీవరెడ్డి ఉపముఖ్యమంత్రిగా పంతులుగారి మంత్రివర్గంలో నియమితుడైనాడు. పంతులుగారి సన్నిహిత సహచరులు తెన్నేటి విశ్వనాథం ప్రజాపార్టీ ప్రతినిధిగా మంత్రివర్గంలో చేరారు.

1953 అక్టోబరు 1 న కర్నూలు రాజధానిగా ఏర్పాటైన ఆంధ్రరాష్ట్రాన్ని ప్రధాని జవాహర్‌లాల్‌నెహ్రూ ప్రారంభించారు. ఉప రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ శుభాకాంక్షలు తెలిపారు.

ప్రకాశం మంత్రివర్గం 13 నెలలు మాత్రమే అధికారంలో వుంది. అయితే అయిదేండ్లలో సాధించగల పనులు స్వల్పకాలంలోనే చేసింది. 14 నీటిపారుదల ప్రాజెక్టులను మంజూరు చేసింది. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం స్థాపన జరిగింది. ఆంధ్రదేశానికి హైకోర్టు ఏర్పడింది. వివిధ జైళ్లలోవున్న ఆరువేల మంది ఖైదీలను 19౯4 జనవరి 14 న రాష్ట్రం ఏర్పాటు శుభసందర్భంగా విడుదల చేయడం దేశంలోనే సంచలనం కల్గించిన నిర్ణయం.

# ప్రకాశం బ్యారేజి

కృష్ణానదిపై విజయవాడ వద్ద గల ఆనకట్ట 11 లక్షల ఎకరాలకు సాగు నీటిని కల్పిస్తుంది. ఆ ఆనకట్ట మరమ్మతు చేయబోయి చీఫ్ ఇంజనీరు వేపా కృష్ణమూర్తి ప్రాణాలు కోల్పోయాడు. అందుచేత ఈ పురాతన ఆనకట్ట పునర్నిర్మించాల్సి వచ్చింది.

ప్రకాశంగారి దూతగా తెన్నేటి విశ్వనాథం ఢిల్లీ వెళ్ళి ప్రధాని నెహ్రూ, ప్లానింగ్ కమిషన్ వారితో దీనిని గూర్చి ప్రస్తావించినా ఫలితం కన్పించలేదు.

కేంద్ర సహాయం లేకపోయినా ఇది నిర్మించి తీరాలని, సంజీవరెడ్డిని శంకుస్థాపన ముహూర్తం నిర్ణయించమనినారు ముఖ్యమంత్రి ప్రకాశం.

మూడుకోట్ల రాష్ట్ర ప్రభుత్వ నిధులతో నిర్మితమైన ఈ ఆనకట్ట ప్రకాశం బ్యారేజిగా చిరస్థాయిగా నిలిచిపోయింది.

ప్రకాశం మంత్రివర్గ కాలంలోనే నేటి నాగార్జున సాగర్ నిర్మాణానికి చర్యలన్నీ తీసికొనబడినవి.

# ప్రజా సంక్షేమ కార్యక్రమాలు

ప్రకాశం మంత్రివర్గం పదిరూపాయలు లోపు పన్ను చెల్లించే పేద రైతులకు పన్ను మినహాయిస్తూ ఉత్తర్వులు చేసింది. చేనేత పనివారిపై, ఒంటెద్దు బండ్లు నడిపేవారిపైగల పన్నులన్నిటినీ రద్దు చేసింది.

రాష్ట్రంలో నాలుగుచోట్ల- తుని, సంత నూతలపాడు, ఎర్రగొండపాలెం, కోవెలకుంట్లలో ఖాదీ ఉత్పత్తి భారీఎత్తున జరిగేది. కూలిరేట్లు అధికం గావించబడినవి. చరఖాలు, ప్రత్తి చౌకగా అమ్మకం చేసేవారు. మొత్తం మీద 23 వేలమంది ప్రజలు వీటివల్ల ప్రయోజనం పొందారు.

# మరలా అవిశ్వాసమే....

ప్రకాశం ప్రభుత్వం మద్యపాన నిషేధం గూర్చి శొంఠి రామమూర్తి కమిటీని నియమించింది. ఆ కమిటీ సిఫార్సులు అమలు చేయలేదంటూ ప్రభుత్వంపై 1954 అక్టోబరు చివరన అవిశ్వాస తీర్మానం తీసికొని వచ్చారు.

రెండు తీర్మానాలను ఒకే అంశంమీద ప్రవేశపెట్టారు మొదటి తీర్మానం 7 ఓట్ల తేడాతో వీగిపోయింది. రెండవ తీర్మానం అనవసరంగా ఓటుకు పెట్టబడింది. ఒకే ఒక్క ఓటుతో తీర్మానం నెగ్గింది. ప్రకాశం మంత్రివర్గం రాజీనామా చేసింది.

## 1955 ఎన్నికలు

ప్రకాశం మంత్రివర్గం పదవి నుండి వైదొలగిన ఆరు నెలలకు ఎన్నికలు వచ్చినవి.

కమ్యూనిస్టులను ఎదుర్కొనేందుకు కాంగ్రెసు, ప్రజా పార్టీ లోక్ పార్టీలు ఐక్య సంఘటనగా ఏర్పడి రాష్ట్ర శాసనసభలో మెజారిటీ సాధించాయి.

ప్రకాశంగారు తమ స్వంత ప్రదేశమయిన ఒంగోలునుండి అధిక మెజారిటీతో శాసన సభ్యుడైనాడు

కానీ తిరిగి శాసనసభ నాయకుని ఎన్నికలో ఆయనను సంప్రదించడం జరుగలేదు. వృద్ధాప్యమనే పేరిట ఆయనను విస్మరించారు. బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రిగా, నీలం సంజీవరెడ్డి ఉపముఖ్యమంత్రిగా నియుక్తులైనారు. ఒక దఫా విశాఖ విచ్చేసిన నీలం సంజీవరెడ్డి "నేను ప్రకాశం గారి హయాంలోనూ ఇప్పుడూ ఉపముఖ్యమంత్రినే! అయితే ప్రకాశం గారితో పని చేస్తేనే ఘనత. పంతులుగారి పాలనలోగల వేగము బాధ్యత ప్రజాసంక్షేమ కాంక్ష మరే ముఖ్యమంత్రిలో చూడలేము" అని ప్రకటించాడు.

# నిష్క్రమణ

1955 లో ఒంగోలు శాసన సభ్యుడుగా ఆంధ్రప్రదేశ్ శాసనసభ సమావేశాలకు హాజరై చర్చలలోసైతం పాల్గొనేవాడు. తాను కలలుగన్న విశాలాంధ్ర సాధించడం ఆయనకు ఆనందం కల్గించింది. తన పదవిని కాలదన్ని విశాల రాష్ట్ర భావానికి చేయూతనిచ్చిన బూర్గుల రామకృష్ణరావు పట్ల ఆయనకు అమిత వాత్సల్యం.

అలాగే విశాలాంధ్ర కోసం విశేషకృషి చేసిన అయ్యదేవర కాళేశ్వర రావును ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకరుగా ఎన్నికైనపుడు 1956 డిశంబరు 4 న అభినందించారు.

అప్పటి ఆయన ప్రసంగం ఇలా సాగింది. (ఇదే వారి అఖరి ప్రసంగం కూడా):

"శ్రీ కాళేశ్వరరావు గారు నాకు చిరకాలపు స్నేహితుడు."

స్పీకర్ : గారు అనవద్దండి!

ప్రకాశం : గారూ అనడం మీయొక్క ఉద్యోగానికి అనుకూలమైన మర్యాద. విశాలాంధ్ర విషయంలో కాళేశ్వరరావు చేసినంత కృషి మిగిలిన వారెవరు చేయలేదు. తమరు అధ్యక్షులుగా వుండగా విశాలాంధ్ర అభివృద్ధి చెంది ప్రజలందరికీ మేలు జరుగుతుందనే నమ్మకం నాకు వుంది. విశాలాంధ్ర ఏర్పడడాన్ని నా కళ్ళతో సంతృప్తిగా చూచినాను. సంతోషించినాను. మీకందరకు అభివందనలు తెలియజేస్తున్నాను.

# అంతిమ యాత్ర

ఆంధ్రప్రదేశ్ ఏర్పడే నాటికి ప్రకాశం వయస్సు 84. అయినా ఆయన పాత మిత్రులను దర్శించేందుకు సుదూర ప్రాంతాలకు వెళ్తూనే వుండేవారు.

ఒకసారి ఢిల్లీ వెళ్ళి ఇంపీరియల్ హోటల్‌లో బసచేసి గోవింద వల్లభ పంత్‌ను పలకరించి వచ్చాడు.

1957 మేలో ఒంగోలు ప్రాంతం అంతా పర్యటించి హైద్రాబాదు చేరుకున్న ప్రకాశానికి వడదెబ్బ తగిలింది.

18 రోజులు ఉస్మానియా ఆస్పత్రిలో మృత్యువుతో పోరాటం సాగించాడు. మే 20 ఉదయాన ఆక్సిజన్ ఎక్కించారు. అయినా ఫలించలేదు.

ప్రకాశం ఆత్మ అనంతవిశ్వంలో లీనమైంది.

1957 మే 20 సాయంత్రం నాల్గు గంటలకు ప్రభుత్వ లాంఛనాలతో బంధుమిత్రులు వెంటరాగా ప్రకాశం భౌతికకాయం హైద్రాబాద్ పిదులగుండా అంబర్‌పేట శ్మశానానికి చేరింది.

ఎవరినోట విన్ననూ 'ఎంతటి మహాత్ముడు పోయాడు!' అని వినిపించింది.

# ప్రముఖుల నివాళులు

ప్రకాశం అంత్యక్రియలు జరిగిన అంబరుపేటలోనే సంతాప సభ జరిగింది. గవర్నరు పంపిన సంతాప సందేశం ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి చదివారు.

ప్రకాశం గుణగణాలను శ్లాఘిస్తూ ముఖ్యమంత్రి సంజీవ రెడ్డి, మాడపాటి హనుమంతరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, కొండా వెంకట రంగారెడ్డి, కళా వెంకట్రావు, నూకల రామచంద్రారెడ్డి, అల్లూరి సత్యనారాయణరావు, వల్లూరి బసవరాజు ప్రభృతులు ప్రసంగించారు.

మర్నాడు లోకసభలో గోవింద వల్లభపంత్ ప్రసంగిస్తూ ఆంధ్ర ప్రజలు ప్రకాశంగారిని ప్రాణప్రదంగా ప్రేమించారని ఆయన సేవలను కొనియాడారు.

భారతదేశ రాజకీయాలలో శక్తివంతమైన శక్తిగా ప్రకాశం గుర్తింపబడ గలడని ప్రధాని నెహ్రూ ప్రకటించారు.

లోక్‌సభ స్పీకరు మాడభూషి అనంతశయనం అయ్యంగారు 1928లో మద్రాసులో సైమన్ కమిషన్ బహిష్కరణ సందర్భంగా తుపాకులను ఎదుర్కొన్న మహావీరునిగా ప్రకాశాన్ని ప్రశంసించారు. స్వాతంత్ర్య సమరంలో తన సర్వస్వం సమర్పించిన మహా త్యాగిగా ఆయన నివాళులర్పించారు.

# ప్రకాశం వ్యక్తిత్వము

కష్టసుఖాలను ఒకే విధంగా భావించిన ప్రకాశం భగవద్గీతలో తెలుప బడిన స్థితప్రజ్ఞుడు.

మద్రాసు మైలాపూరులో విశాలమైన భవంతి, ఊటీ ఒంగోలు రాజమండ్రిల్లో బంగళాలు భూములు తోటలు అన్నీ స్వాతంత్ర్య సమరకాలంలో హరించుకొని పోయాయి. అయినా ప్రకాశం చలించలేదు.

వారి దుస్థితిని గుర్తుచేసిన తన అభిమాని, అనుచరుడు నీలంరాజు వెంకట శేషయ్యకు భగవద్గీత శ్లోకం "అనికేతః స్థిరమతిః బుద్ధిమాన్ మే ప్రియోనరః" అని చెప్పి సముదాయించాడు.

# జగమెరిగిన బ్రాహ్మణుడు

స్వాతంత్ర్య సమరంలో స్థిరంగా ఒకచోట వుండే అవకాశం లేక పోయింది. జన్మచేత బ్రాహ్మణుడైనా ఏనాడూ కులాభిమానం ప్రస్తావన ఆయన తెచ్చేవాడు కారు కాని సంప్రదాయాలను తాను పాటించకపోయినా ఇతరుల భావాలను గౌరవించేవారు. తాడిపత్రిలో కలచవీడు వెంకటరమణాచార్యులు ఆయనకు నమ్మిన అనుయాయి. ఒకసారి వారింట భోజనానికి వెళ్ళారు. ముందుగా స్నానం చేయబోతూ ఆచార్యుల వారిని పిలిచి ఒక జందెం తెప్పించమని కోరారు. అందుకు కారణం కూడా చెప్పాడు. జందెం లేకపోతే ఆడవాళ్ళు (అందునా ఆచార్ల వారిది శ్రీవైష్ణవ కుటుంబం) షాక్ అవుతారు అన్నారు.

కలచవీడు పరమ సాధువు. "తాడిపత్రి మునిసిల్ రాజకీయాలు గందర గోళం (Bungle) చేశావు కదూ" అంటూ ఆచార్యులను మందలించారు ప్రకాశం గారు.

'ఆ ఫైలు మరలా చూడండి. ఎవరు (Bungle) చేశారో మీకే తెలుస్తుంది' అని పరుషంగా జవాబిచ్చారు కలచవీడువారు. ప్రకాశంలో వాత్సల్యం పెల్లు బికింది. 'నన్ను ఎదిరించే సాహసం నీకు కలిగినందుకు నాకు చాల సంతోషంగా విందయ్యా' అని భుజం తట్టారుట.

భోజనం చేసిన ఇంటి యజమానికి గాక గృహిణికి కృతజ్ఞతలు తెలిపే వారు ప్రకాశం.

వృద్ధాప్యంలో కొద్ది రోజులు ఢిల్లీలో పత్రికా విలేఖరిగా వున్న జి. కృష్ణ అతిథిగా వున్నారు. వెళ్ళిపోయే రోజున "అమ్మా, వెళ్ళి వస్తా"నని శ్రీమతి కృష్ణకు మాత్రమే చెప్పి శలవు తీసికొన్నాడు ప్రకాశం.

'అన్నదాతా సుఖీభవ' అనే భావాన్ని....

ప్రకాశంగారిని తొలిసారి దర్శించినపుడు తనకు రోమన్ వీరులు తలపుకు వచ్చారని తెలిపారు ఆచార్య రంగా.

ఆయన ముఖారవింద ఆకర్షణ ఎంత ప్రశస్తమయినదో గాని రాణులు, మహారాజులు ఆయనకు పరమ గౌరవ మర్యాదలు చూపేవారు.

ఒకసారి ప్రకాశంగారు తిరువాన్కూరు నుండి కోయంబత్తూరుకు కారులో వచ్చారు. తనతో వచ్చిన మిత్రుణ్ని కారు డ్రైవరుకు అయిదు రూపాయలు ''ఈనాము'' ఇవ్వమనినాడు. అప్పుడు అతను నాలుక కరచుకొని చెప్పారట- వారు కొచ్చిన్ మహారాజా సోదరుడనీ, కేవలం తమ సేవాభాగ్యం లభించాలనే ఆసక్తితో కారు నడిపాడనీ!

మరొక సంఘటన:

ప్రకాశంగారు నిరంతరం పర్యటనలో వుండేవారు. వారి కారుకు లైసెన్సు కట్టడం మర్చిపోయారు.

కొవ్వూరు కోర్టు ఆవరణలో కారు నిలిపి ఏదో పనిమీద వేరే చోటుకి వెళ్ళారు. వారు వచ్చేటప్పటికి కారు జప్తు చేశారు.

సరే, ఎవరు చేశారీపని అంటూ "ఆ ఇనస్పెక్టరును ఇటుపిలూ" అన్నారట. అతను వచ్చేసరికి అతని ఊరూ, పేరూ విచారించి 'మంచిది, ఆ డబ్బేదో కట్టి విడుదల చేయించు' అన్నారట.

అతడు మారు మాటాడక డబ్బు చెల్లించి క్రొత్త లైసెన్సు కారుకు అంటించి పంతులుగారి వద్ద సెలవు తీసికొన్నాడట.

ఇలాంటి సంఘటనలు పంతులుగారి సుదీర్ఘ జీవితంలో కొల్లలుగా ఉన్నాయి.

# ప్రట్టాభి మాటల్లో పకాశం

"ప్రకాశంగారు ఉత్తర ధృవము, నేను దక్షిణ ధృవము వంటివారము. ప్రకాశంగారికి రేపటి చింతలేదు. నేను యెల్లుండి విషయముకూడా ఆలోచింతును. న్యాయవాద వృత్తిని వదలునాడు భవిష్యత్తు యెట్లు జరుగునా యని ప్రకాశం ఆలోచింపలేదు. వైద్యవృత్తిని వదలునాడు నేను రెండుపూటలా భోజనము కలిగియుండు విషయమై బాగుగా ఆలోచించితిని. ఎచట ప్రమాదమున్న అచట ప్రకాశం ప్రత్యక్షమగును. నేను గమనించుచుందును. నేనొక చిన్న వేదాంతిని. ప్రకాశముగారొక సైనికుడు, వీరుడు, ప్రకాశంగారిని ఆపదలాకర్షించును క్షేమ పద్ధతి ఆకర్షింపదు. తెగింపు ఆయన నైజము, సలహాలను స్వీకరింపడు. లేమిడి కాశపడును. సంపద ననుహ్యించుకొనును. హెచ్చరికలను వినడు. అదియే ఆయనకు నాకు గల భేదము

''మాష్టా తిరుగుబాటు రంగమునకు యెందరు వలదన్నను, పోలీసులెంత అడ్డగించినను ఆయన వెళ్ళెను. గుంటూరులో పన్నుల నిరాకరణోద్యమమును ప్రారంభింప నెంతయో పట్టుదల చూపెను. గుంటూరంతయు అప్పుడు సైనికులతో నిండియుండెను. కాని ప్రకాశం జంకలేదు. ఇది గాంధీజీ కిష్టములేదు. బార్డోలీ పన్నుల నిరాకరణోద్యమ ఫలితములకై గాంధీజీ వేచియుండ దలచెను. కాని ప్రకాశం మాత్రము గుంటూరు ముందా, గుజరాతు ముందా అని ప్రశ్నించెను. చీరాలలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య సరసన నిలవగలిగినదొక్క ప్రకాశమే. చీరాల ఉద్యమమును గాంధి యామోదింపలేదు. ఆమోదింపకపోగా 'ఈ ఉద్యమ సత్ఫలితానుభూతి నాకు దక్కను. దుష్ఫలితానుభూతి గోపాలకృష్ణయ్యదే' అనెను. గాంధీజీ కోంటి బిడ్డవలెనే ప్రవర్తించెను.

''నేను కూడా పుట్టుకతో బ్రాహ్మణుడనైనను కోమటినే. నేను యిది యంతయు గమనించుచుంటిని. ప్రకాశం మాత్రం గాంధీజీ ఆమోదమునకై వేచియుండ యిష్టపడలేదు. మొన్న సరిహద్దు పర్యటనకు వెళ్ళినపుడు కూడా ప్రకాశం తెగింపు మాత్రమే కన్పడినది. ఆయన మొదటినుండీ యోధుడే.

''ఆంధ్రులకు ఉద్రేక మెక్కువ. ఒక్క ఉద్యమము ప్రారంభమైనచో మొదటినాడే అందరును దానిలోకి దూకుదురు. మరునాటి ఆలోచనే లేదు. దేశము కొరకై ప్రకాశము సర్వమును త్యజించెను. ఈ త్యాగము చిచ్చులో ఆయన ముందు పడిపోయి యితరులను పడవేసెను. ప్రకాశంలో సంపద పోయెనని దిగులులేదు. ఆయన వయస్సెంతో ఆయనకు తెలియదు. దినదినమునకు యువకుడగుచున్నాడు.

''అన్నిటికంటె మరువరాని దినమొకటి యున్నది. అది 1946 ఏప్రిల్ 9. మన రాష్ట్ర మంత్రివర్గ వ్యవహారములను పార్లమెంటరీ బోర్డు వారు పరిష్కరింప బూనిరి. మమ్మందరను పెద్ద నాయకులు పల్లకి మోతగాళ్ళవలె జూచిరి. పైవారిద్దరు పోట్లాడుకొని మన వ్యవహారములను రచ్చకెక్కించిరి. గాంధీజీ ప్రకాశంకు వ్యతిరేకముగా వర్కింగు కమిటీ చేతనే తీర్మానమును చేయింతు ననెను. కాని ప్రకాశం జంకలేదు. పోట్లాడెను. చివరకు గెలిచెను.

''ఇంత పట్టుదలతో, ఉత్సాహముతో, యిన్ని యేళ్ళుగా సేవచేసిన వ్యక్తి చరిత్రలో లేడు. ఆయనకు చేయెత్తి నమస్కరించుట మన విధి.''

